# ముఖచిత్రం : డా. ఆలపాటి రవీంద్రనాథ్ గారిది (యువకుడుగా)

## పుట్టిన రోజు :

డా ఆలపాటి రవీంద్రనాధ్, మిసిమి వ్యవస్థాపక సంపాదకులు, నవంబరు 4, 1922న, పూర్వపు తెనాలి తాలూకా గోవాడ గ్రామంలో జన్మించారు ఎలాగో ఈ అస్తిత్వంలోకి ''విసిరివేయబడిన'' తరవాత తన అస్తిత్వానికి అర్థం కల్పించుకొన్న తీరు అద్భుతం అందుకే 'మిసిమి' కి All that we are is the product of what we have thought" is we are what we think" అనే ధమ్మపద వాక్యాన్ని మకుటం చేసుకొన్నారు చదువులు హైస్కూలు దాటకపోయినా, నాడు 1948 ల్లో రేరాణి, కినీమా, జ్యోతి లాంటి విశిష్ట, విలక్షణ పత్రికలు నడపినా, రూపురేఖాలావణ్యంలో, విషయ నైశిత్యంలో తనకు తానే సాటి అయిన 'మిసిమి' ని వ్యవస్థాపించి, సంపాదకించినా, "Time'(USA) పత్రికా పఠనా వ్యసనానికి లోనైనా, రసెల్ రాసిన "History of western philosophy", Will Durant, Gabriel లు రాసిన "The story of civilization" గ్రంథాలను అవలోడనం చేసినా, - వీటన్నింటిలో ఆయన ఎదిగిన, చేరిన ఎత్తులు, తన అస్తిత్వానికి చెప్పుకొన్న, కల్పించుకొన్న అర్థం (సారం) కనిపిస్తుంది తెనాలిలో జ్యోతి ప్రెస్‌ను ప్రారంభించి దానిని హైదరాబాద్‌లోనే అగ్రగామి అయిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ గా ఎదిగించడంలో ఆయన ప్రతిభ కనిపిస్తుంది

ఆయన అనన్యకతను దర్శించాలంటే ఆయన పేరు పెట్టడాన్ని చూడాలి అవి అందంగా ఉంటాయి అవి మరొక చోట కనిపించవు ఆయన పెట్టిన పబ్లికేషన్స్ పేరు జాకోబిన్ పబ్లిషర్స్ స్థాపించిన పత్రికల పేర్లు రేరాణి, జ్యోతి, కినిమా, మిసిమి, విజయవాడలో ఇంటికి ఇచ్చిన విలాసం పల్లవి. ఆయనకు సౌందర్య నేత్రం ఉంది He has an eye for beauty అందుకే అలాంటి పేర్లు పెట్టగలిగారు పేర్లకు తగ్గట్టు వాటిని ''నాజూకు''గా తీర్చి దిద్ద గలిగారు

''ఎరితోనైనా, ఏ విషయం మీదనైనా ''అర్థవంతమైన'' సంభాషణ సాగించగల సామర్థ్యాన్ని నాకందించింది Time అంటారు ఆయన. నాలుగు దశాబ్దాల పాటు Time పత్రికని క్రమం తప్పక, తుదిశ్వాస (1996 ఫిబ్రవరి 11) విడిచేవరకు చదివారు "Anatomy is Destiny" అన్నాడు ఫ్రాయిడ్ ఈ స్థాయికి ఎదగడానికి ఆయన అవిరళ కృషేకాదు, ఆయన రూపురేఖా తనూ విలాసం కూడా కారణమే అనితరమైన ఆయన సౌందర్యం మొదటిగా బాటవేస్తే, ఆ బాటకు ఆయన మేధ, కళాభిరుచులు బలం చేసి రంగులు దిద్దేవి.

జీవితాన్ని రెండు రకాలుగా జీవించవచ్చు (1) Living fully and 2. Fully Living కొంతమంది జీవితాన్ని తామరాకు మీద నీటి బొట్టులా, ఉపాంతం (Margin), లో, లోతులు తాకకుండా జీవిస్తారు అలా కాకుండా, జీవితాన్ని నిండుగా గాఢంగా జీవించాలంటారు ఆయన ఇదే Living fullly అంటే ఇహ మరొకటి, మనకిచ్చిన కాలాన్నంతా - సహస్రచంద్ర దర్శనకాలమో, నూరు శరత్తుల కాలమో జీవించడం ఇది కాలాన్ని నింపే జీవితం ఎండు వారిన కట్టెలా కాక, గణితసూత్ర (mathematical) వ్యాకరణ సూత్ర (grammatical) మానవునిగా కాక, గాఢాభి నివేశంతో, నిండుగా, లోతుగా, పూర్ణంగా అరమరికలు లేని, ''ఎంపిక లేని ఎరుక'' (Choice less awarenss) తో జీవించాలంటూ ఉండేవారు ఆయన అనడమే కాదు, ఆదారిలో కొంతమేర నడిచారు

ఆయన స్థాపించిన, చేపట్టిన ప్రతి దాని మీద మనకు ఆయన ''సంతకం'' కనిపిస్తుంది. 'మిసిమి' మీద ఇప్పటికీ.

చిత్రకారుడు **రహ్మత్ అలీ**

# మిసిమి

"All that we are is the product of what we have thought" is "We are what we think." — Dammapada.

సంపుటి 9 నవంబర్ 1997 సంచిక 10

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : డాక్టర్ **రవీంద్రనాథ్ ఆలపాటి**

**Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,**
**1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536**

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# MAUGHAM AND MY BROTHER

By SHAHNAZ HASHMI

It was a hot and humid winter in Bangkok I was staying with my brother Every day it was getting hotter and having heard that there were only three kinds of weather - hot, hotter and hottest -in that part of Thailand, I was dreading the worst But Somerset Maugham was enjoying it.

Meeting Somerset Maugham in Bangkok turned my visit into a pilgrimage. He came to dinner at my brother's house. Stars in the sky and candles on tables illuminated the evening and the Siamese mosquitoes provided the music.

My brother Saad and Maugham shared jokes. They appeared to be a funny pair. Maugham, the grand old man of English literature, and Saad dashing, handsome, elegant. The old man with a lifetime of experience and his full share of sorrow and wisdom, the young man unknown to suffering with a song in his heart and dreams in his eyes. But they had much in common. Both admired beauty and love life and people

It filled me with joy to see my brother and the writer hitting it off so well The fragrant air, delicious food and a lively gathering of artists, poets and scholars! One could not have asked for more. My brother made every one happy while his wife Zarina, the artist of the family, made hurried sketches which I later titled "Maugham and Me."

He told me much about reading and writing.

"Read everything that comes your way. For good prose read Rose Macaulay. Write simple prose, no involved structures. Simplicity is the beauty of prose."

"Mr Maugham, when are you going to revisit India? I asked hopefully.

"My young secretary here says I am not going to India", he replied. The "young" secretary, who was in his sixties, nodded in confirmation.

"But your fans in India will be disappointed", I protested.

"Oh, they'll survive it!" concluded Maugham with that characteristic British understatement.

The English Department of Chulalongkong University in Bangkok celebrated his 86th birthday that year. Perfumed Thai girls poured scented water on his palms. He autographed "Cakes and Ale" for us. That started it. We quarrelled over the possession of that precious book. Finally, he let me have it and I brought the book with me to India. Little did I realize when I showed my prize to my friends how keenly my brother wanted to keep that autographed book.

Maugham enjoyed long years of fame and glory but my brother was gone in the prime of his life. Now when I miss my dear brother every momen I wish I could give him my entire collection of Maugham books

# కవితకు గణుతీ, సమ్మానం ఈనోబెల్ పురస్కారం

## (1995 సాహిత్య నోబెల్ బహుమతి స్వీకృతి ప్రసంగం:)

మూలం. సీమస్ హీని                                        అనుసరణ : గద్దె బుచ్చయ్య

నలభయ్యో దశకం ఐర్లండ్‌లోని గ్రామీణ డెరీ కౌంటీలో సతత ప్రవర్థమానమౌతున్న కుటుంబం మనోభావనాపరంగా, మేధోపరంగా బయటి ప్రపంచంతో సంబంధంలేని కుటుంబం తామరతంపరగా వున్న ఆ కుటుంబంలోని చిన్న పిల్లాడినైనా నాకు మా ఇంటిప్రక్కనుంచి ప్రశాంతతను భగ్నంచేస్తూ, భూమిని కుదుపుతూ, గాలిని సంచలనంచేస్తూ ఓ రైలు వెళ్లేది అలా శబ్దాలూ, చిత్రమైన ఈలల మధ్య వార్తలు చదివే వ్యక్తి గొంతులోనుంచి 'శత్రువు', 'మిత్రులు' అని విచిత్రగంభీరంగా పదేపదే వెలువడే పదాలు, బాంబుదాడులూ, వాటికి గురైన నగరాలు, కూలిన విమానాల వివరాలు సేనాగణాంకాలు, యుద్ధఫలితాలు నా ఆలోచనాప్రకృతికీ, సాహిత్యయాత్రకీ పూర్వరంగంగా రూపొందాయి కాని ఆ రేడియోప్రసారంలో నన్నాకట్టుకున్నవి ఓ డిటెక్టివ్ సీరియలూ, ఓ రాయల్ ఎయిర్ ఫోర్స్ అధికారిపై అల్లిన సాహసగాధలూను స్టేషన్ని ఇంకా నిర్దిష్టంగా సరిదిద్ది మరింత స్పష్టంగా వినాలనే ప్రయత్నంలో బీబీసీకి అటూయిటుగ లీపీటిగ్, ఓస్లో, స్టటగ్గార్ట్ లాంటి విదేశీకేంద్రాల్తో బాటు స్టాక్‌హోమ్ పేరును మొట్టమొదటిసారి విన్నాను అలా విదేశభాషలతో కలిగిన పరిచయం నా ప్రపంచాన్నధిగమించి వెళ్లే యాత్రారంభానికి దారితీసింది భాషావిస్తృతిలోనికి సాగిన ఈ ప్రస్థానపు ప్రతి మజిలీ గమ్య మనడానికి బదులు సోపానమయింది ప్రతిష్ఠాకరమైన ఈ వేదికపై నిలిపింది కానీ ఈ వేదిక సోపానంలా గాక రోదసీస్థావరంలా నాకు తోస్తోంది అందుకనే జీవితంలో తొట్టతొలిసారిగా రోదోవీధిలో పాదసంచారానంద మనుభూత మౌతుంది

ఈ రోదసీ వాహ్యాళిని నా కనుభూతం చేసినందుకు కవితకే ఈ ఘనత బాహిరవాస్తవాల ప్రభావానికీ, కవి చేతనాంతర్యాభిత నియమాల స్పందనకీ, సత్యనిబద్ధతను సంతరించి పెట్టే కవితకే ఈ ఖ్యాతి ఈ నిబద్ధత మనం జీవనపరమావధిగా ఏదికావాలని ఎంచుకుంటామో, చివరికా లక్ష్యాన్నందుకోవడం ఈ నిబద్ధత మేధోక్షుధను పరితృప్తంచేసేదీ మనోమార్దవాల్నంటిపెట్టుకుని వుండేదీను కవిత తనకు తానుగా తన అస్తిత్వాన్ని నిలుపుకుంటున్నందుకూ, మానవాళి కేడుగడగా వుంటున్నందుకూ, మనోకేంద్రకానికీ దాని బహిర్వలయానికీ తరళ చైతన్యబంధం సుసాధ్యం చేస్తున్నందుకూ, వైర్లెస్ రిసీవర్ సెట్ పైని స్టార్‌హోమ్ పేరును తదేకంగా చూసిన పిల్లాడికీ, ప్రత్యేకతతో పరిఢవిల్లే ఈ క్షణాన స్టాక్‌హోమ్‌లో ముఖాముఖీ శ్రోతృగణాన్ని చూస్తూన్న ఈ ఎదిగిన వ్యక్తికీ బంధాన్ని పొసగించిన కవితకే ఈ గణుతి సమ్మానం మనకాలంలోనూ, ఏకాలంలోనైనాను జీవితానికి సత్యసందర్శనం చేయిస్తుంది గనుక కవితకు గౌరవాన్నందుకునే అర్హత సంపూర్ణంగా వుంది

జీవితంలో సత్యాన్ని ఆవిష్కరించడానికి సుస్పష్టమైన విశ్వసనీయత అవసరం దేనిని సమర్థిస్తుందో, దేనిని వ్యతిరేకిస్తుందో సూటిగా చెప్పే కవిత నాకు చాల ఆనందాన్ని కలిగిస్తుంది. బడికి వెళ్లే బాలుడిగా భాషకూ భావానికీ సంగమంగా నిలిచిన జాన్ కీట్స్ రాసిన 'టూ ఆటమ్' నీ,

---

★ **గద్దె బుచ్చయ్య** గుంటూరు హిందూకళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

కౌమారంలో ఆనందపారవశ్యానికీ, ఉద్విగ్ననిర్వేదానికీ ప్రతీకలుగా వుండే ఆశ్చర్యార్థక బంధురత్వాన్నీ రచనాంతర్గతార్భాటాల్నీ నిరసించే అర్హత తనకున్నంత ప్రపంచంలో వేరెవ్వరికీ లేదని భావిస్తుంది

నేను విశేషంగా ప్రేమించాను కర్షకజనజీవనసౌందర్యాన్ని సాకల్యంగా జీర్ణించుకున్న, ప్రపంచ కఠోర విధివిధానాల్నెరిగిన రాబర్ట్ ఫ్రాస్ట్‌ను ఇష్టపడతాను ఈ కారణాల వలననే చాసర్ కూడా నా కిష్టం కొత్తనిబంధన లాంటి రచనలనిరుకునపెడుతూ, కొత్త శతాబ్దపు మొరటుదనాన్ని లోగొన్న విల్‌ఫ్రెడ్ ఓవెన్ కవితా, ఎలిజబెత్ బిషప్ శైలీ వైదగ్ధ్యం, రాబర్ట్ లావెల్ శైలీదార్ఢ్యతా సూటిగా ఎదుర్కొనే పాట్రిక్ కవనా రచనా విధానం - ఇవన్నీ కవితలో అంతర్లీనంగా వున్న సమర్థతనీ, బాధ్యతనీ విశ్వసించి ఏ జరుగుతుందో చెప్పడానికీ, కేవలం కవితను కవితకోసమే ఉపాసించటానికేగాక మానవజాతిలో నిండి నిబిడీకృతమైన మన భూగ్రహాన్ని జాలిగా ఆవిష్కరించుకోడానికి కారణాలుగా నిర్దేశించాయి

గత పావుశతాబ్దం బయటనివసించినా, ఉత్తర ఐర్లండ్‌లో పుట్టి పెరిగిన అనుభవం వాస్తవానికి దర్పణంపట్టేగుణమున్న కవితవైపు మొట్టిన మనసుకు ప్రోదిగా నిలిచింది నా జన్మభూమి సునిశిత పరిశీలనాదృష్టికీ, వాస్తవికవాదానికీ తనతో ఎవరూ సరిపోలరని గర్వంగా ప్రపంచాన్ని తేరిపారజూస్తుంది · రచనాంతర్గతార్భాటాల్నీ, ప్రగల్భాలన్నీ నిరసించే అర్హత తనకున్నంత ప్రపంచంలో వేరెవ్వరికీ లేదని భావిస్తుంది అందుకనే వాలస్ స్టీవెన్జ్, రెయినర్ మరియ రిల్కేల లోని భావవిభూతీ, విస్తృతీ నాలో అగుపించకుండా సంవత్సరాలుతరబడి సగం తప్పుకుంటూ, అడ్డుకుంటూ, ఎమిలి డికిన్సన్‌లోని పారదర్శకాంతరస్థానాన్ని అరకొరగా అనుష్ఠిస్తూ, ఎలియట్ భావవైచిత్రిని దరిజేర్చక దూరంగా వుంటూ వచ్చాను ఇలా పరిమితులు విధించుకోడం కవినేగాదు ఏ నాగరికుణ్ణైనా ముభావముద్రవైపుకు తీసుకెళ్తుంది రాజకీయంగా నడుస్తున్న హింసాప్రవృత్తీ, ప్రజల ఆదర్శాల, ఆకాంక్షల నిరంకుశత్వం, వీటి పరస్పర వైరుధ్యం కవిని ఇరుకున పెడతాయి

ఇలాంటి పరిస్థితుల్లో అమేయ విశ్వాసంతో శామ్యుల్ జాన్సన్ పేర్కొన్న సత్యస్థైర్యంలో ఆశ్రయంపొందాలని నామనస్సు ఆకాంక్షిస్తుంది అయితే దీనికి తన విచారణల, కార్యకలాపాల స్వభావాల అస్థిరతే బాగా తెలుసు ఇది అనేక వాదవివాదాల విశేషవేదికని చేతనకు తెలుసు చిన్నతనంలోని గృహవాతావరణం, రెండో ప్రపంచయుద్ధవాతావరణం, కౌమారపు అశేషసమస్యాచ్ఛాదిత విద్యావాతావరణాన్ని దాటి ఏడో దశకంలో డబ్లిన్‌కి దక్షిణంగావున్న విక్లోకౌంటిలో నా కొత్తకుటుంబంతో స్థిరపడ్డాను ఇక్కడానూ ప్రాదేశిక ఐరిష్ రిపబ్లిక్ సేన బాంబుదాడులే గాక, ప్రభుత్వానుకూల సేనాసహాయక దళాల బాంబుదాడులూ మా ఇంటికి పరిసరాల్లో మార్మోగుతుండేవి 1930లోని ఆసిఫ్ మెండెల్‌స్టామ్ విషాదగాథను చదివి చేతన నిరీహకు గురైంది మధుర మనస్వి నా పాఠశాలసహాధ్యాయిని విచారణతో నిమిత్తంలేకుండా జైలుపాల్జేసినా. మనసు సంక్షుభితమైందే తప్ప పోరాటవైమనస్యం నుంచి బయల్పడలేదు ఆ సమయంలో నేను కోరుకున్నది స్థిరత్వం కాదు సాపేక్షార్థ సైకతస్థితి నుంచి చైతన్యవంతమైన పలాయనం కలవరంలేని, సంజాయిషీ అవసరంలేని కవితకు అర్థసమ్మానాన్నందించటానికిదో మార్గం

అమెరికన్ కవి ఆర్చిబాల్డ్ మక్లీష్, 'కవిత సత్యతుల్యం, సత్యంకారాదు' అని అన్నాడు కవిత సత్యాన్ని పరోక్షంగా, స్పృశామాత్రంగా, సరిదిద్దే విధంగా చెప్పాలి అయితే ఒకోసారి గట్టి అవసరం వచ్చినప్పుడు కవిత ధర్మానంద సమ్మితంగానేగాక జ్ఞానాన్ని సుప్రతిష్టతం చేయవలసివచ్చినప్పుడు, ప్రపంచంపై ఒక విస్మయాత్మక వైవిధ్యాన్ని ప్రయోగించటమే గాకుండా ప్రపంచానికి తిరిగి దాని లయను దానికి సంపాదించి పెట్టవలసిన బాధ్యత కవిత కుంది చిత్రవిచిత్రగతులతో కదలుతూ తెరమీద ఎంతకూ కుదురుగా కూర్చోని టీవీ బొమ్మకు కుదరును తెచ్చే టీవీ సెట్‌పై వేసే ఓ గమ్మత్తైనగుద్దు లాంటి దా విస్మయాత్మకవైవిధ్యం లయతప్పి, అనియతిగా, వేగంగా ఆడే గుండెను క్రమగతికి జేర్చే విద్యుదాఘాతం లాంటిది లెనిన్‌గ్రాడ్ ఓ జైలు క్యూలో చలిలో గడగడ వణకుతూ, భయభయంగా రచయిత్రి ఐన ఆక్మతోవాను ఓ రషన్ యువతి 'స్టాలిన్ నిరంకుశ పాలనను కవితతో కళ్లకు కట్టినట్టు వర్ణించలేవా' అని అడిగిన ప్రశ్నలాంటిది. ఇలాంటిదే ఆపాత పరిస్థితుల్లోవున్న విక్లో కౌంటిలో నేను కూడా చేయదలుచుకుంది

Death of a Nationalist (1996), Door into the Dark (1969), Field work (1979), Sweeney (1983), Station Island (1985), The How Lantern (1987), Seeing things (1991) లు అతని రచనలు సీమస్ హీనీ వ్యవసాయ దారుల కుటుంబంలో, మాస్ బాన్, ఉత్తర ఐర్లండ్‌లో 1939 లో జన్మించాడు. వారు కాథలిక్కులు, బెల్ఫాస్ క్వీన్స్ విశ్వవిద్యాలయంలో విద్యను అభ్యసించి, అక్కడే ఉపన్యాసకుడు అయ్యాడు తరవాత కాలిఫోర్నియా బెర్క్లీ, హార్వర్డ్, ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయాలలో అధ్యాపకుడుగా పనిచేశాడు ఆక్స్ ఫర్డ్‌లో 89 నుంచి 94 వరకు కావ్యాల అధ్యాపన లో ఆచార్యులుగా పనిచేశారు ప్రస్తుతం డబ్లిన్‌లో ఉంటున్నారు ఆయన తొలిపద్యాలన్నీ గ్రామీణ ప్రాథమిక లయాత్మక జీవితాన్ని విశ్వసించాయి. W B యేట్స్ ప్రభావం ఇతనిమీద ఉంది **- సంపాదకుడు.**

ఉత్తర ఐర్లండ్‌లో 1968 నుంచి 1974 దాకా సంభవించిన బహిరంగ వాస్తవికతనూ, అంతర్గత చైతన్యాన్నీ వెల్లడిచేసిన సంచలనాత్మకమైన సంఘటనలు తీవ్రమైన మార్పుకు సూచికలు. ఎంతోకాలం క్రితమే అల్పసంఖ్యాకులకు హక్కుగా లభించవలసిన మార్పుకు సంకేతాలు క్రైస్తవనీతీ సైద్ధాంతికుడు ఐరిష్ రిపబ్లిక్ సేవా బాంబుదాడుల్ని దారుణమని నిందిస్తూండగా, కేవల ఐరిష్ వాది 1972లో డెరీలో జరిగిని బ్లడీ సన్డే లాంటి సంఘటనలలో బ్రిటిష్‌సేనా క్రౌర్యానికి జుగుప్స ప్రకటిస్తూండగా, అవమానానికి గురై, వివక్షకు వ్యధచెందిన అల్పసంఖ్యాక నాగరికుడు ఐర్లండ్‌లో జీవనం నిజంగా పరిఢవిల్లాలంటే మార్పు మహావశ్యకమని నమ్ముతూ, కావ్యసత్తా విష్కరణ కోసం ఎదురుతెన్నులు చూస్తున్నాడు. ఐఆర్ఏ (ఐరిష్ రిపబ్లిక్ సేన) మార్పుకోసం చేపట్టిన పాశవికవిధానాలు ఆ మార్పు రాదగిన కొత్త అవకాశాలకు ప్రాతిపదికగా వుండవలసిన విశ్వసనీయతకు విఘాతం కల్పిస్తున్నదనే ఈ వివక్షావ్యధితుడి అభిప్రాయమూ సత్యదూరం కాదు

1974లో సనింగ్‌డేల్ సమావేశానంతరం అల్‌స్టర్ లాయలిస్ట్ కార్మికుల పటిష్ఠ బలవ్యూహానికి ష్ ప్రభుత్వం లొంగిపోడం వాస్తవికత, న్యాయం ఒక అవిభాజ్య భావసంశ్లేషణంగా

ఏర్పడతాయనే ఆశాభావం అసంగతమని 1994 దాకా ఇరవయ్యేళ్లుగా కొనసాగిన కాల్పులవిరమణను భగ్నంచేసిన సంఘటనలు ఋజువుచేశాయి. క్రింది స్థాయినుంచి మొదలైన హింసాధోరణి పైస్థాయి ప్రజలు రాజకీయ సంఘీభావం, ఉద్విగ్నవేదన, ఆత్మరక్షణకోసం తీసుకునే అతిజాగ్రతల మూలాన కఠిన తరమౌతున్న ధోరణులమధ్య, ఇరుకౌతున్న అవకాశాల మధ్య పావు శతాబ్దపు జీవితం, ఉత్సాహం వమ్ముకాగా రాజీకి రాజీపడ్డారు.

1976 లో ఒక సాయంత్రం జరిగిన సంఘటన గుండెల్ని పిండేసింది ఆర్ద్రతతోనింపింది ఒక మినీబస్‌లో వచ్చే కార్మికుల్ని సాయుధ దుండగుల ముఠా ఒకటి కిందకు దింపి, వరుసలో నిలిపి, కేథలిక్కు లెవరైనా వుంటే బయటికి రావాలని శాసించారు ఇది ఇంతకుముందు ప్రొటెస్టెంట్లను చంపినదానికి ప్రతీకారంగా సేనాసానుభూతిదళాలు కేథలిక్కులను వధించడాన్ని వ్యూహమని అందరూ భావించారు. అందులో ఒకే ఒక కేథలికున్నాడు. బయటకు రాబోయిన అతన్ని. 'నీకేం ఫరవాలేదు నిన్ను రక్షించుకుంటాం.' అన్న భావం స్ఫురించేలా ప్రక్క కార్మికుడు చేయి పట్టుకుని మృదువుగా నొక్కాడు. కానీ అతను బయటికి వచ్చాడు. వెంటనే అతన్ని కిందకు పడనెట్టి మిగతావాళ్ల నందర్నీ కాల్చి చంపారు అందరూ అనుకున్నట్లు వాళ్లు ప్రొటెస్టెంట్ ఉగ్రవాదులు కారు. ప్రాచీన ఐ ఆర్ ఏ దళం ప్రజల్లో లేని వివక్ష కక్ష రాజకీయ వర్గాలకే వుంది. ప్రజల్లో ఒకరిపట్ల మరొకరి కున్న కరుణ, సానుభూతి ప్రేమలో, స్వార్థంకోసం, అధికారంకోసం వెంపర్లాడే రాజకీయపక్షాలకు లేశమాత్రమైనా లేవు.

చరిత్ర వధ్యశాలాతత్వాన్ని బోధించేదే అనే భావాన్ని అణచుకోలేం. 'శాంతి - దృఢచిత్తంతో నిర్దయగా వ్యవహరించిన బలం మిగిల్చిన నిర్మానుష్యం' అని టాసిటస్ చెప్పింది వాస్తవం. కాని, భవిష్యత్తు కేథలకుని అనుకంపాభరితంగా ఆపిన అభయంలో వుంటుంది గానీ, ఉగ్రవాదులు తుపాకీగుళ్ల జడిలో లేదు. నాగరికతా నిర్ధారణా పత్రాలు సమస్తం రక్తం, కన్నీళ్లతోనే రాయబడ్డాయనే సత్యాన్ని మందమతులే తప్ప మర్వెరూ కాదనలేరు. విశ్వవదనంపై అల్‌స్టర్, ఇజ్రాయెల్, బోస్నియా, రువాండాలాంటి గాయాలు మానవస్వభావాంతర్గత నిర్మితీక్షమను చూపలేకపోవడమేగాక, కళాసర్జనలోని ఏ సుగుణాన్ని నిరూపితం చేయలేకపోతున్నాయి అందుకే నేను, ప్రార్థనాపీఠంపై వలమోపి సుదీర్ఘ ధ్యానమగ్నుడైన సన్యాసిలా, ఏళ్లతరబడి చైతన్యస్ఫోరకాలైన కావ్యాలు నిర్మించక పోయినా, నిర్మించాలనే దృఢసంకల్పంతో రచనా క్రతువును నిరంతరం నిర్వహిస్తూ వస్తున్నాను వజ్రకఠోరమైన అన్యనిరపేక్ష్యాలను పూర్తిగా నిభాయించలేని నేను పూర్తిగా కల్పనా వ్యాసంగానికి అంకిత మయ్యాను. నా మాతృభూమి క్రుంగిపోకుండా మనసును దిటవు చేసుకుని నా విధినిర్వహణకు సిద్ధపడ్డాను. కొద్ది సంవత్సరాల క్రితమే అద్భుతాలకీ, అంతకాలకీ నుంచి ఓ కథను కూర్చడానికి మలచుకుంటాను.

చేతులుచాచి ప్రార్థనాముద్రలోవున్న చేతులమధ్య గుడ్లుపెట్టిన పక్షిపై కరుణతో ఆపక్షి గుడ్లనుంచి పిల్లలు వచ్చి, పెరిగి పెద్దవై ఎగిరిపోయిందాకా భయపడి పారిపోతాయేమోనని కదలకుండావున్న సెయింట్ కెవిన్ గాథ ఈ రోజు విఘటనా విశ్లేషణా విమర్శ (డీకన్‌స్ట్రక్షన్) మాధ్యమంలో వలసవాదానికి ప్రతీకగా నిరసిస్తున్నారు. స్వచ్ఛంగా సాగే ఐర్లండ్‌జీవనస్రవంతిని కలుషితం చేయడానికి వచ్చిన వలసవాదిగా వర్ణిస్తున్నారు ఈ గాథను గ్రంథస్థం చేసిన జిరాల్డస్

కేంట్రుగెనిస్‌ను ఐరిష్ భాషావిశ్లేషణా వేత్త 'తప్పుడు చరిత్ర రాసిన మందలోని ఆబోతు'గా అసహ్యించుకున్నాడు. కాని తొలినాళ్ల క్రైస్తవ నాగరికతలో దోపిడీ, క్రౌర్యాన్ని చూడ్డం తగదని నేననుకుంటాను.

ఈ శతాబ్దం నాట్సీ వెట్టిని ఆయుధప్రాబల్యంతో మట్టికరిపించండాన్ని చూసింది అయితే ఇతర కారణాలతోబాటు కఠోరసైద్ధాంతిక భావజాలంక్రింద బలవంతంగా అణచిపెట్టబడిన సంస్కృతీ విలువలు, మనసుపరమైన తిరుగుబాట్లు సోవియట్ పాలన అంతరించడానికి అనుకూలించాయి. సంస్కృతీరూపాలు, సంప్రదాయమౌఢ్యాలకు అగ్రపీఠం వేసిన ఏదేశమైనా ఆత్మప్రమాణవాద, బహిష్కరణవాద విధానాలకు దిగజారి జాతిదురహంకారిగా మారుతుందనేది చారిత్రక సత్యం మన జాతి సాంస్కృతిక విలువలు, మత విశ్వాసాలు ఇతరులపట్ల మన విశ్వాసాన్నీ, ప్రేమనూ, స్థానభ్రంశం చేయగూడదు దీనికి భిన్నంగా అది ఆరోగ్యకమైన రాజకీయవాతావరణాన్ని సృష్టించి, ప్రోదిజేసే అవకాశమున్న ప్రపంచం సుసాధ్యమే ననే విశ్వాసం కలిగివుండాలి ఘోరమైన సామూహిక వధలు, హత్యలు, మారణకాండలు పౌనఃపున్యమైనా పాలస్తీనీయులూ యూదుల మధ్యా, ఆఫ్రికన్లు, ఆఫ్రికాలలో స్థిరపడ్డ డచ్, యూరోపియన్ ఆఫ్రికన్ల మధ్యా కొత్త బంధాలు నెలకొనడం, ఇనుపతెరలు పైకిలేవడం, జాతిని రెండుజేసినగోడలు నేలకొరగడం, విశ్వాసం సాధించిన ఘన విజయాలకి తార్కాణాలు. ఇదే విశ్వాసం ఐర్లండ్‌లోగూడా కొత్త అవకాశాలకు తలుపుతీయగలదనే ఆశను జాగృతంచేస్తుంది. ఈ సమస్యలోని కీలకమైన అంశం ఈ ద్వీపం (ఐర్లండ్) లో బ్రిటిష్, ఐరిష్ అధికార పరిధుల్ని నిర్వచిస్తూ జరుగుతున్న విభజన దీనికి తీసిపోనిది ఉత్తర ఐర్లండ్‌లోని బ్రిటిష్, ఐరిష్ సంస్కృతీ వారసత్వ అనుభావాల మధ్య చీలిక ఆ యా ప్రభుత్వాలు సరైన పాలనను టెనిస్ కోర్ట్‌లోని నెట్‌లా చూసుకుంటూనే స్పర్థకు తావిచ్చేలా వుండేట్లు, పరికల్పనచేసేటట్లైతే ఇంత క్లిష్టసమస్యా ఇట్టే తేలిపోతుంది. అప్పుడు మనసుకు పట్టుకు వేలాడే 'శత్రువు' 'మిత్రులు' అనే ఈ పదాలు అంత పూర్తిభిన్నంగా ధ్వనించవు

డబ్లూ. బీ. యేట్స్ డెబ్బయ్యేళ్ల క్రితం ఈ వేదికనుంచి నోబెల్ పురస్కృతిని స్వీకరించి నప్పుడు, ఐర్లండ్ బ్రిటన్‌పై జరిపిన స్వాతంత్ర్యయుద్ధం, దానివెనువెంటనే సంభవించిన అంతర్యుద్ధం తాలూకు దెబ్బల్నుంచి అప్పుడప్పుడే బయటపడుతూ వుంది. ఆ అంతర్యుద్ధం రక్తసిక్తమైందీ, క్రౌర్యంతో కూడుకుందీ, సన్నిహితమైందీను. మొదట ఐరిష్ ఫ్రీస్టేట్‌గా, తరువాత రిపబ్లిక్ ఆఫ్ ఐర్లండ్ అని పిలవబడే ఇరవయ్యారు కౌంటిలమధ్య రాజకీయ గతవిధుల్ని తరాలతరబడీ శాసించగలిగిన యుద్ధమది. అయితే యేట్స్ ఈ రెండింటిని గురించీ ప్రస్తావించలేదు. వీటిని గురించి యేట్స్‌కి తెలిసినంత కూలంకషంగా మరొకరికి తెలియదు కానీ ఆయన ఐరిష్ నాటకోద్యమాన్ని గురించి మాత్రమే మాట్లాడాడు. తన మాతృదేశానికి స్థానిక కవులు, రచయితలు నిర్వహించిన పాత్రగెరిల్లాదాడులంత కీలకమైనదని వ్యాఖ్యానించాడు వీరివలననే తన యౌవనంలో మృతప్రాయంగా వున్న ఐర్లండ్ భయద ప్రమదమయమైన ఐర్లండైనదని చెప్పాడు. ఆయన కృతులసమస్తంలో పదేపదే స్మరించు కునే, 'మనిషి ఘనత ఎక్కడ మొదలై, ఎక్కడ ముగుస్తుందో ఆలోచించండి. నా ఘనత మాత్రం నాకలాంటి

మిత్రులుండుటమే'. అనే పాదాలు ఆ ఉద్యమంలో వున్న వారిపట్ల ఆయనకున్న గాఢ గౌరవాన్ని వెల్లడిస్తాయి.

ఇక్కడ కవిత సమర్థతను బుజువుచేసుకోడంకన్నా, సోయగాలు ప్రకటించుకుంటున్నది. అది కవికి గౌరవ పీఠం. కవితతో ఇప్పుడు నేనదే చేస్తున్నాను యేట్స్ తన పాఠకుల్ని నలభైయేళ్ల ఐరిష్ సాహితీవేత్తలు సాధించింది, మననం చేసుకోమన్నాడు అదే మిమ్మల్నీ కోరుకొంటున్నాను. వాళ్లలో నాకు చాల గొప్ప మిత్రులున్నారు. గొప్ప రచనని చేయనివారి అభిప్రాయాన్ని రచయిత కాగోరేవాడు స్వీకరించ వద్దన్నాడు ఎజ్రా పౌండ్ దానినే నేననుసరిస్తూన్నందువలన ముప్పై యేళ్ల క్రితం మొదలైన నా కవితాయత్నం నిరంతరం బలోపేతమైంది.

యేట్స్ కవిత సమస్తం కేవలం రచనావైదగ్ధ్యభరితమే కాదు. మన శతాబ్దపు కవితావైభవం ఆయన రాసిన, 'నైన్టీన్ హండ్రడ్ అండ్ నైన్టీన్', 'మెడిటేషన్ ఇన్ టైమ్ ఆఫ్ సివిల్ వార్', అనే రెండు కవితలు కలవందే సమగ్రంకాదు రెండు కవితలోని 'కమ్ బిల్డప్ ఇనద హౌస్ ఆఫ్ స్టేర్' అనే గీతిక ప్రముఖమైనది. దీన్ని పూర్తిగా, భాగాలుగా ఐర్లండ్‌వాసులు గత పాతకేళ్లుగా స్మరించుకుంటున్నారు. జీవనంపట్ల సెయింట్ కెవికాకున్న హృదయమార్దవం, జీవితంలోని వడిదుడుకులకి హోమర్ చూపిన నిబ్బరం వీనిలో వున్నాయి. మినీబస్ సంఘటనలోని కేతలిక్‌కి సానుభూతిగా, దన్నుగా నిలిచిన తోటిమనిషి మానవతాభరిత మృదుస్పర్శ దానిలో వుంది సత్యాన్ని చెప్పవలసిన అవసరంతో బాటు, ప్రతీకార వికృతచర్యల్ని ఖండించే బాధ్యత కవిత కుందనీ, ద్వేష, హితానిక కడ్డునిలిచినా, విశ్వాసాన్ని భగ్నంచేసినా మనసు బండవారగూడదనీ

# ఓ అసూయలల కల

– సీమస్‌హీని

పచ్చికబయిళ్ళ చిట్టడవిలో
నీతో, మరొకామెతోనూ నడుస్తున్నప్పుడు
గుసగుసలు పోతున్న గడ్డి పోచల వేళ్ళు
అనుమానాస్పద మన నిశ్శబ్దాల్లోంచి
పరుగులెత్తాయి
మనం కూర్చొన్న చోట
ఒక అస్పష్ట అనూహ్య స్పష్టతలోకి
బాహువులు చాస్తున్నాయి చెట్లు
నిష్పాక్షిక కాంతే బహుశా
భయ పెడుతోందనిపిస్తోంది మనల్ని -
వాంఛ గురించి ఆవరించే అసూయ గురించే
మన ముచ్చట్లు -
వొదులొదులు పంచెలానో
పరిచిన తెల్ల దుప్పట్లానో
మన సంభాషణ రుజు ప్రవర్తనావళి గ్రంథమై
తెరుచుకుందా పచ్చని అడవిలో -
'చూపించు' అన్నానామెతో
'నేనమితంగా వ్యామోహించిన నీ వక్షపు ఊదా
నక్షత్రాన్ని'
ఒప్పుకుంది
ఇకలిప్తమరిచిన నీ చూపుగాయాన్ని
ఈకవిత్వాలు . . నా వివేకాలూనయంచేయలేవు
ఒక్క ప్రేమ తప్ప-

స్వేచ్ఛానువాదం : నరేష్ నున్నా

కవిత ఆదేశిస్తుందనీ ఈ కవిత చూపుతుంది. కవిత సత్యసదృశం, సత్యం కూడా అని ఇక్కడ ఋజువైంది. ఇది ఏనా అక్మతోవా నుంచి రషన్ స్త్రీ ఆశించిన కవితలాంటిది, చారిత్రక క్లిష్టత, వైయక్తిక విస్మయాల మధ్య చిక్కుకున్న విల్యమ్ వర్డ్స్ వర్త్ అల్లిన కవిత లాంటి సంపూర్ణ పర్యాప్త కవితకు మనోహరోదాహరణ

ట్రాయ్‌పతన సందర్భంగా జరిగిన మానవ మహామేధాన్ని విని శోకవిహ్వలుడైన ఒడిస్యూజ్ విలాపాన్ని హోమర్ తనదైనశైలిలో ఒక బృహదుపమతో కళ్లకు కట్టాడు.

'మరణవేదనతో వగరుస్తూన్న తన భర్తచెంతకు జారిగిలబడి, అతన్ని విహ్వలశోకంతో పొదివిపట్టుకోబోయే సమయానికి భుజాలపైనా, వీపుకీ పదనుగా గుచ్చుకుంటూన్న శూలాల దిశానిర్దేశంతో బానిసంబంధాల లోకీ, అనంతభేదపుటంచులలోకి కూరుకుపోయి రోదిస్తున్న ఆయువతి విలాపం కంటే మిక్కిలి జాలినిగొలిపే విధంగా వుంది ఒడిస్యూజ్ విలాపం'

ప్రత్యక్ష ప్రసారాల ద్వారా పాత వార్తాచిత్రాల్లో చూపిన కాన్‌సెంట్రేషన్ క్యాంప్ (నాట్సీ వధ్యవేదికలు) లతో ఏమాత్రం తీసిపోని సమకాలీన క్రౌర్యాన్ని పదేపదే చూసి ఇవుండేవే అన్న భావన మనసును మభ్యపెట్టే ప్రమాదం ప్రపంచాన్ని సుడివేయబోతూంటే, మూడువేలేళ్లనాడు హోమర్ రూపొందించిన వాక్చిత్రంలోని కాలాతీత విశ్వజనీనత గోచరమౌతూంది.

శ్రుతప్రపంచ దేవాలయ నివాసి కవిత స్వరారోహణావరోహణలు, భావస్ఫురణ, లయ, శ్రావ్యత, పాద నిర్మితుల నుంచి కలిగిన చైతన్యంతో జరిగిన భాషావిచ్ఛిత్తి, విలీనం నుంచి ఉద్భవించిని కవితాశక్తికి కవికున్న ఆసక్తులు, సత్యనిష్ఠ కున్న ప్రాధాన్యతుంది వాస్తవానికి కవితా మాధ్యమంలోనే సత్యమావర్తితమై వుంటుంది. ఎమిలీ డికిన్సన్, పాల్‌సెలాన్‌లో పుష్కలంగా కనిపించే ఈ లక్షణం జాన్ కీట్స్‌లో వైభవ పరాకాష్టకు చేరుకుంది కేవల విషయప్రకటన చేసే గొంతులను దాటి వినిపించే ఈ సమ్మోహన స్వరం కోసమే కవి వొళ్లంతా చెవులు చేసుకుంటాడు. నా అన్వేషణా, కృషీ శ్రావ్యతా పరిప్లుతమూ, సంతృప్తికరమైన పదాల కోసమే ఇదే శ్రద్ధను నే జదివే కవితలోనూ చూపుతాను.

కవితారూపం ఓడా, లంగరూను ఇది తేల్చి వుంచుతూ కూడా స్థిరంగా ఒకచోట నిలిపేది ఇది దేహాన్నీ, మనసునూ కేంద్రోపసారిగా, కేంద్రోన్ముఖంగా ఏకమాత్రకాలంలో అలరించడానికి వీలుకల్పిస్తుంది. ఇలాంటి సాధన సామగ్రితోనే యేట్స్ కవిత ఆవశ్యకమైన కవిత సదా ఏం చేస్తుందో అదే చేసింది అదేమిటంటే మనలోని అనుకంపాప్రకృతి నిరంతరం ప్రపంచంలో గుణాన్ని కోల్పోయేటప్పుడు మనలోని సాను భూతీతంత్రుల్ని సున్నితంగా శ్రుతిజేసి, మీటి, మానవతారాగాల్ని పలికిస్తుంది. కవితకు ఘనతను సంతరించిపెట్టే దానిరూపం తనవిధిని నిర్వర్తించే శక్తినందించే క్లిష్టపాత్రను పోషిస్తుంది. ఆ శక్తి మనచుట్టూ దౌష్ట్యం రాజ్యమేలుతున్న దృష్టాంతాలు బలంగా వున్నా, మన చేతనలోని దుర్బలమైన భాగాన్ని ధర్మబలోపేతం చేస్తుంది ఆ శక్తి మనం విలువల వేటగాళ్లమనీ, విలువల్ని భద్రంగా పోగుచేసుకునే వాళ్లమనీ జ్ఞాపకంచేస్తూ వుంటుంది. ఆ శక్తి, దుర్భర ఏకాంతాలూ, దైన్యాలూ మన సహజ మానవ జీవనంలో అవిభాజ్యభాగాలని మనకు నచ్చజెబుతుంది.

# మహాకవి అశ్వఘోషుడు

(గతసంచిక తరువాయి)

- టి. రవిచంద్

వజ్రసూచి రచించబడిన నాటి సామాజిక, చారిత్రికనేపథ్యాన్ని కనుక మనం గ్రహించగలిగితే బ్రాహ్మణాధి పత్యాన్ని అది ఎందుకు అంత తీవ్రంగా ప్రతిఘటించిందో గ్రహించగలం మౌర్య సామ్రాజ్య పతనం, శుంగ, కణ్వ వంశాల ఆవిర్భావం భారతదేశ చరిత్రను సమూలంగా మార్చివేసింది. అన్నిరకాల అసమానత్వాలకు, దోపిడీకి మూలమైన బ్రాహ్మణ రాజైన పుష్య మిత్ర శుంగుడి చేతిలో అప్పటి వరకు మౌర్య చక్ర వర్తుల చేతుల్లో నిర్మించబడ్డ మానవతా పూరితమైన సామాజిక వ్యవస్థ అంతరించి పోయింది[16] వర్ణ వ్యవస్థ పునః స్థాపించబడింది శుంగ, కణ్వ వంశస్థులు బౌద్ధ ధర్మ వ్యతిరేకులు పూర్తిగా బ్రాహ్మణ మత పక్షపాతంగల వారు వీరి కాలంలోనే బ్రాహ్మణమత పునరుద్ధరణ కార్యక్రమం భారీ యెత్తున సాగింది. బ్రాహ్మణ మతానికి సంబంధించిన సామాజిక, మత భావాలు, సంస్థలు మారిన చారిత్రక పరిస్థితులకు అనుగుణంగా పునః వాఖ్యానించడం, వాటిని పటిష్ట పరచడం అనే కార్యక్రమం జరిగింది ''వర్ణానాం బ్రాహ్మణో గురుః'' అనే ఫాసిస్టు వర్ణాధి పత్య భావనకు మౌర్యయుగానంతరమే తిరిగి ప్రాధాన్యత ఏర్పడింది. మేధస్సులో, తెలివితేటల్లో వ్యక్తిత్వంలో అల్పులైనా జన్మకారణంగా వారు ఉన్నత వర్ణస్థులుగా పరిగణించబడుతున్నారు. ఈ అతిశయాన్నే వజ్రసూచిలో అశ్వఘోషుడు నిరసించింది శుంగ, కణ్వ వంశరాజులు బౌద్ధ వ్యతిరేకులు బ్రాహ్మణాధిపత్య సమర్థకులు వీరి కాలంలో నవ బ్రాహ్మణ వాదం (neo - Brahmanism) కొత్త పునాదుల మీద పటిష్టంచేయబడిందని డా॥ భూపేంద్రనాధ్ దత్తా, డా॥ అంబేద్కర్, నార్ల వెంకటేశ్వరరావు (వి. ఆర్ నార్ల). డా॥ పి సిన్హా లాంటి పండితులు భావించారు. నార్ల వెంకటేశ్వరరావు నియోబ్రాహ్మినిజం (నవబ్రాహ్మణవాదం) గురించిరాస్తూ ఇలా అన్నారు. **"In the religious history of India the period between 185 B.C. and A.D. 300 has a crucial importance. To meet the challenge posed to its very existence by Buddhism and Jainism and other religious which deny the authority of the Vedas, Brahminism transformed itself into neo-Brahmanism during post-mauryan period[17]."** నార్ల వెంకటేశ్వరరావు అన్నట్టు భారతదేశ మత చరిత్రలో క్రీ పూ. 185 - క్రీ.శ. 300 మధ్యకాలం నిర్ణాయకమైన ప్రాముఖ్యత కలిగి ఉంది. వేదాధికారాన్ని ప్రశ్నించే బౌద్ధ, జైన ఇతర మతాలనుండి ఎదురౌతున్న సవాలును ఎదుర్కొనడానికి మౌర్యయుగానంతరం బ్రాహ్మణ వాదం నవబ్రాహ్మణ వాదంగా రూపాంతరం చెందింది ఈ చారిత్రక నేపథ్యంలోనే మహాకవి అశ్వఘోషుడు కూడా జీవించాడు అందువల్లే వజ్రసూచిలో ''సర్వవర్ణ ప్రధానం బ్రాహ్మణ వర్ణం'' అనే విషయాన్ని ఆయన చర్చించాడు. అన్ని వర్ణాలలోకి బ్రాహ్మణ వర్ణం ఏ విధంగా ఉన్నత వర్ణం అనేది అశ్వఘోషుడి ప్రశ్న ''సర్వవర్ణ ప్రధానం బ్రాహ్మణ వర్ణం'' అనే విషయాన్ని ఆయన బ్రాహ్మణుడంటే ఎవరు? అనే ప్రశ్నతో విశ్లేషించి అది ఎంత అహేతుక భావనో నిరూపించాడు. బ్రాహ్మణుడంటే జీవమా? జాతియా? శరీరమా?

---

**టి. రవిచంద్** తత్వశాస్త్రంలో ముఖ్యంగా బౌద్ధంలో విస్తారమైన కృషి సలిపిన మేధావి. గుంటూరులో ఉంటున్నారు.

జ్ఞానామా? ఆచారమా? కర్మమా? వేదమా? అని ప్రశ్నించి అవేమీ బ్రాహ్మణుడుగా పరిగణించబడటానికి, గుర్తించబడటానికి పనికిరావంటాడు. అదీ వైదిక గ్రంథాల ఆధారాలతోనే.

బ్రాహ్మణత్వం అనేది ఒక వర్గం, ఒక వర్ణం లక్షణం కాదు జాతి లేదా జన్మ ప్రత్యేకత అంతకంటే కాదు. అది ఆత్మికాభివృద్ధి (spiritual advancement) లో ఒక దశ గా అశ్వఘోషుడు వజ్ర సూచిలో చిత్రిస్తాడు (వజ్రసూచి తెలుగు అనువాదం XVII - XVIII). బ్రాహ్మణత్వం అనేది జన్మకారణంగా రాదు. అది సాధన ద్వారా లభిస్తుందని చెప్పడం ద్వారా వర్ణవ్యవస్థ పునాదుల్ని అశ్వఘోషుడు సమర్థవంతంగా పెకిలించగలిగాడు తొలిబౌద్ధ సాహిత్యం వర్ణ వ్యవస్థ మన సమాజంలో ఎంతగా పాతుకు పోయింది చూపిస్తుంది బుద్ధుడు వర్ణ విభేదాల్నిఖండించాడు. బుద్ధుడి తర్వాత వర్ణ వ్యవస్థను తీవ్రంగా ప్రతి ఘటించిన వాడు అశ్వఘోషుడు. గ్రంధరూపంలో వర్ణవ్యవస్థను విమర్శిస్తూ వెలువడిన తొలిబౌద్ధ రచన వజ్ర సూచి. అయితే కొంతమంది విమర్శకులు బుద్ధుడు భిక్షు సంఘంవరకే వర్ణ భేదాల్ని పాటించ లేదని, సామాజిక వ్యవస్థకు సంబంధించి ఆయన వర్ణ వ్యవస్థ జోలికి పోలేదని అంటుంటారు. బౌద్ధుల వర్ణవ్యవస్థ విమర్శ భిక్షు సంఘంవరకే పరిమితమయితే, అశ్వఘోషుడు లాంటి సుప్రసిద్ధ దార్శనికుడూ, కవీ ప్రత్యేకంగా వర్ణవ్యవస్థను విమర్శిస్తూ వజ్రసూచి లాంటి రచన చేయాల్సిన అవసరంలేదు. బ్రాహ్మణ, శ్రమణ సంప్రదాయాలను వాటిమధ్య ఉన్న ప్రధానమైన తేడాల్ని గుర్తించిన వారు ఇటువంటి విమర్శలు చేయరు శ్రమణ సాంప్రదాయ నేపథ్యంనుండి ఆవిర్భవించిన బౌద్ధం ఎటువంటి పరిస్థితులలో నూ బ్రాహ్మణీయ వర్ణవ్యవస్థను ఆమెదించదు అశ్వఘోషుడి విమర్శనా పద్ధతి విశిష్టమైనది. ఆయన బ్రాహ్మణ వాద ఖండనకు శృతి, స్మృతులనే ప్రమాణం తీసుకున్నాడు అదొక వాదనా పద్ధతి. చరిత్రలో చాలా మంది సంఘ సంస్కర్తలు ఈ పద్ధతినే అనుసరించారు. కాని ఎవరూ అశ్వఘోషుడి పేరు కృతజ్ఞతా పూర్వకంగా పేర్కొనలేదు మనకు తెలిసినంతవరకు ఆయన కంటే ముందు ఈ పద్ధతిలో బ్రాహ్మణాధిపత్యాన్ని, వర్ణవ్యవస్థను ఎదుర్కొన్న వారు లేరు ఆయన ఈ వాదనా విధానానికి ఒక విధంగా పితామహుడు. ఈ వాదనా పద్ధతి వల్ల సనాతనుల నుండి వ్యతిరేకతకంటే అనుకూల ప్రతిస్పందనే ఎక్కువగా ఉంటుంది ఎటువంటి వారిలోనయినా హృదయ పరివర్తన రాక తప్పదని భావించే బౌద్ధులు ఇటువంటి తార్కిక పద్ధతి అనుసరించడంలో అశ్చర్యం లేదు. ఒక విధంగా ఇది పాజిటివ్ విమర్శనా పద్ధతి. ఈ వాద విధానం ముందు ఎటువంటి సాంప్రదాయవాది నిలబడడు అశ్వఘోషుడు తనవాదన లో ఉద్వేగానికంటే వివేచనకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాడు తన ప్రత్యర్థుల మనస్సుల్ని గాయపరచకుండా, వారిలో మానసిక పరివర్తన కలిగించేట్టు వజ్రసూచి లోని వాదన ఉంది

మహాకవి అశ్వఘోషుడి వజ్రసూచి సనాతన బ్రాహ్మణ వర్గంలో ఎటువంటి ప్రభావాన్ని కలిగించిందో తెలియజేసే ఒకే ఒకసాహిత్యాధారం - వజ్ర సూచికోపనిషత్తు. ఇది తొమ్మిదిసూత్రాల చిన్న గ్రంధం. ఇది బౌద్ధుల వజ్రసూచిన అనుకరిస్తూ, దాని సంగ్రహ రూపంగా వెలువడిన ఉపనిషత్తు. త్రిమతాచార్యులు దీన్ని పేర్కొన లేదు. ఒకానొక చారిత్రక దశలో బౌద్ధుల వాదనల్ని బలహీన పరచడంకోసం, వారు చెబుతున్నదే మేమలా చెబుతున్నామని నమ్మించడం కోసం తెలివైన బ్రాహ్మణ పండితుడు ఈ ఉపనిషత్తును సంకలనం చేసి ఉంటాడు. దీనిలోని భావం,

వాదన వజ్రసూచిలోనివే అక్కడక్కడ వేదాంత పరిభాషను ఉపయోగించాడు ఈ ఉపనిషత్తు రచయిత వాదనకోసం వాదన చేయడంలో మన సాంప్రదాయ వాదుల్ని మించినవారు ప్రపంచంలో మరొకరుండరు వజ్ర సూచికో పనిషత్తు సంకలనం చేయబడిన కాలంలో దాన్ని ఎవరయినా పట్టించుకున్నారేమో కాని, నేడు దాని గురించి ఆలోచించే వారు హిందువుల్లో ఒక్కరూ లేరంటే అతిశయోక్తి కాదు. ఉపనిషత్తులపై ఉద్గ్రంథాలు రాసేవారికే దీని సంగతితెలీదు. ('ఉపనిషత్ కల్పతరువు' పేరుతో 108 ఉపనిషత్తులను మూల మంత్రాలతో, తాత్పర్యముతో ప్రచురించిన విద్వాన్ గజ్జె సత్యనారాయణ గుప్త మాత్రం ఈ ఉపనిషత్తును ద్వితీయ సంపుటాలలో చేర్చారు. ప్రార్థనగాన ప్రచార సంఘము, విజయవాడ వారు మూడు సంపుటాలలో 'ఉపనిషత్ కల్పతరువు' ప్రచురించారు) హిందు మతంలోని కొంతమంది ఉదార వాదులు ఈ ఉపనిషత్తుకు కొంత ప్రాధాన్యతనిచ్చారు. ఆధునిక సాంప్రదాయ వాదుల్లో ఒక్క డా॥ ఎస్ రాధాకృష్ణన్ మాత్రమే 'ప్రిన్సిపల్ ఉపనిషద్స్' అనే గ్రంథంలో వజ్రసూచికోపనిషత్తు ఆంగ్లానువాదాన్ని ఇచ్చారు దీన్ని గురించి డా॥ రాధాకృష్ణన్ ఇలా అన్నారు The upanishad is valuable in that it undermines cast distinctions based on birth[18] " (ఈ ఉపనిషత్తు విలువైనది ఇది పుట్టుకపై ఆధారపడ్డ వర్ణవిభేదాల్ని బలహీనపరిచింది) డా॥ రాధాకృష్ణన్ తర్వాత మరొక హిందువు ఎవరూ దీని ఊసెత్తలేదు హిందూ మతాన్ని గురించి రాస్తూ ప్రముఖ సోషలిస్టు చింతనా పరుడు డా॥ రామ్ మనోహర్ లోహియా ఈ ఉపనిషత్తును ప్రత్యేకంగా పేర్కొంటాడు'' A whole upanishand is devoted to the complete and entire demolition of the caste system[19]."

హిందువుల్లోని బ్రాహ్మణేతరకులాల వారిని ఆధునికయుగంలో వజ్ర సూచికోపనిషత్తు కొంతవరకు ప్రభావితం చేసిందనే చెప్పాలి. ఈ ఉపనిషత్తు ఆధారంతో బ్రాహ్మణేతరకులాల వారు తామూ బ్రాహ్మణులమని నిరూపించుకున్న ఒక సంఘటన ఆంధ్రదేశంలో జరిగినట్టు లిటరరీ ఆర్కియాలజిస్టు బంగోరె మన దృష్టికి తెచ్చాడు[20]. 1817 సంవత్సరంలో చిత్తూరు అదాలత్ కోర్టులో విశ్వబ్రాహ్మణులకు, బ్రాహ్మణవర్గానికి మధ్య జరిగిన ఒక కేసు వివాదం సందర్భంలో వజ్రసూచికోపనిషత్తుతో పాటు వేమన పద్యాలను ఉటంకించి, తమ వాదనను వినిపించి జడ్జిని ఆశ్చర్య చకితుడ్ని చేసి విశ్వ బ్రాహ్మణులు తమ కేసును గెల్చుకున్నారు. ఈ విధంగా ఆధునిక ఆంధ్రదేశంలో బ్రాహ్మణేతరకులాల ఆత్మ గౌరవ ఉద్యమానికి సైద్ధాంతిక ప్రేరణగా నిలిచింది వజ్రసూచికోపనిషత్తు. కాని ఈ ఉపనిషత్తుకు మూలమయిన వజ్రసూచి మాత్రం విస్మరించబడింది. వర్ణాంతర వివాహాలను సమర్థిస్తూ 1941 సంవత్సరంలో గోలుకొండ పత్రికలో 'వర్ణాంతర వివాహాలు'[21] అనేవ్యాసంరాస్తూ తెలుగు వైతాళికుడు సురవరం ప్రతాపరెడ్డి తమ వాదనకు ఆలంబనగా వావిళ్ళ వారు ప్రచురించిన వజ్రసూచికోపనిషత్తు ను పేర్కొన్నారు ఈ ఉపనిషత్తును ఇంతవరకు చదవనివారు ఇప్పుడు తప్పకుండా చదవాలని కోరుతున్నానని ప్రతాపరెడ్డి వ్యాసప్రారంభంలో అన్నారు. అంతేకాకుండా తెలుగులో మొదటిసారి ఈ ఉపనిషత్తును ప్రచురించిన పళ్ళె చెంచల రావు ను ఆయన ప్రత్యేకంగా తమ వ్యాసంలో ప్రస్తావించారు ఆధునిక తెలుగు వారిలో ఈ ఉపనిషత్తుకు ఇంత ప్రాధాన్యత నిచ్చిన వారు మరొకరు లేరనుకుంటాను ఆ ఘనత ప్రతాపరెడ్డి గారిదే.

ఆధునిక తెలుగు మేధావుల్లో మహాకవి అశ్వఘోషుడి వజ్రసూచిని పేర్కొన్న వారిలో ఇద్దరు తెలుగువారున్నారు వారు · తొలిమార్క్సిస్టు పరిశోధకుడు డా॥ కె. బి కృష్ణ, డా॥ అంబేద్కర్‌ను ప్రభావితంచేసిన ప్రొఫెసర్ పి లక్ష్మీనరసు. వీరిద్దరూ తమ రచనల్లో అశ్వఘోషుడి వజ్రసూచిని ప్రత్యేకంగా ప్రస్తావించి మానవుల్లో అసమానత్వానికి కారణమైన వర్ణవ్యవస్థను, బ్రాహ్మణాధిపత్యాన్ని ప్రశ్నించడానికి ఈ రచన చాలా ఉపయోపడుతుందని భావించారు కులవ్యతిరేక పోరాటంలో వజ్రసూచి అసాధారణ పాత్ర నిర్వహిస్తుందని వీరిద్దరు అభిప్రాయ పడ్డారు. ప్రొఫెసర్ పి. లక్ష్మీనరసు 'ఏ స్టడీ ఆఫ్ క్యాస్ట్'[22] గ్రంధంలో ''వజ్ర సూచిలో వర్ణవ్యవస్థపై దాడి 'శీర్షికతో ఆయన ఆ గ్రంధంలోని విషయాన్ని చర్చించారు. బ్రాహ్మణులు తమను తాము ఉత్తమోత్తమ జాతిగా భావించడాన్ని వారిమత గ్రంధాలు ఆధారంతోను అదెంత అబద్ధమో నిరూపిస్తూ అశ్వఘోషుడు వజ్రసూచిని రచించాడని ప్రొఫెసర్, పి లక్ష్మీనరసు అభిప్రాయపడ్డారు. ఏస్టడీ ఆఫ్ క్యాస్ట్‌లో ఆయన వజ్ర సూచి సంక్షిప్తాను వాదాన్ని కూడా ఇచ్చారు

డా॥ కె బి. కృష్ణ 'పొలిటికల్ అండ్ సోషల్ థాట్ ఆఫ్ బుద్ధిస్ట్ రైటర్స్ ( బౌద్ధరచయితల రాజకీయ సామాజిక చింతన)' పుస్తకాన్ని 1933 లో హర్వర్డు విశ్వవిద్యాలయంలో ఉండగా రచించారు ఈ సిద్ధాంతవ్యాసంలో డా॥కె బి కృష్ణ క్రీ శ రెండవ శతాబ్దంనుండి ఐదవ శతాబ్దం వరకు కులవ్యవస్థకు వ్యతిరేకంగా వచ్చిన ప్రతిఘటనోద్యమాలను అధ్యయనం చేశారు. బౌద్ధ రచయితల్లో సుప్రసిద్ధుడు, బ్రాహ్మణ మతకవి కాళిదాసుకి పూర్వుడైన అశ్వఘోషుడి గురించి రాస్తూ, ''ఇతర బౌద్ధరచయితల రచనలకంటే ఈయన రచనలు రాజకీయ. సామాజిక ప్రాధాన్యతను సంతరించుకున్నాయ''న్నారు

అశ్వఘోషుడి రచనలుగా సౌందరనందకావ్యం, సూత్రాలంకారం, వజ్రసూచిలను ప్రధానంగా పేర్కొని వాటి లోని రాజకీయ, సామాజిక భావాల్ని ప్రస్తావించారు ఆయన రచనల్లో ప్రధానమైన రచనగా వజ్రసూచిని పేర్కొంటూ దానిగురించి డా॥కృష్ణ ఇలా అన్నారు ''రాజకీయ, సామాజిక సిద్ధాంతాల కొరకు వజ్రసూచి చాలా ముఖ్యమైన రచన '' అశ్వఘోషుడి రాజకీయ, సామాజిక భావాల్ని అధ్యయనం చేయడానికి, అవగాహన చేసుకోవడానికి వజ్రసూచి అత్యంత ప్రాధాన్యత గల రచనగా ఆయన అభివర్ణించారు ఈ రచనలో అశ్వఘోషుడు వర్ణవ్యవస్తను అసమానమైన తార్కిక దృష్టితో, సహజ సమానత్వమనే దార్శనిక ప్రాతిపదికతతో, అశాస్త్రీయమైన బ్రాహ్మణ మత సిద్ధాంతాన్ని తీవ్రంగా నిరసించాడు వర్ణవ్యవస్థను ఖండించడం ద్వారా అశ్వఘోషుడు మానవ సమానతా సూత్రాన్ని చేరుకున్నాడని డా॥ కృష్ణ ఇలా అన్నారు "He arrived at the principle of equality of human beings in attacking the institution of caste". గౌతమ బుద్ధుడి తర్వాత అశ్వఘోషుడే బ్రాహ్మణీయ సామాజిక సిద్ధాంతంపై సమర్థవంతమైన దాడిచేశాడని ఆయన అభిప్రాయపడ్డారు. వజ్రసూచి రచయిత గురించి ఇంకా ఇలా అన్నారు'' ''కుల వ్యవస్థకు వ్యతిరేకంగా సమరశీలమైన యుద్ధానికి అశ్వఘోషుడు నాయకత్వం వహించాడు.'' ఆ విధంగా ఆధునిక ఆంధ్రదేశంలోని ఇద్దరు అబ్రాహ్మణమేధావులు కుల వ్యతిరేక పోరాటంలో వజ్రసూచి విశిష్టతను గుర్తించారు.

ఆంధ్రుల చరిత్రను శాస్త్రీయ దృష్టితో, మానవతా దృక్పధంతో పరిశోధన చేసిన సమకాలిక

ఆంధ్రచరిత్రకారులలో డా॥ బి ఎస్. ఎల్. హనుమంతరావు సుప్రసిద్ధులు ఆంధ్రప్రదేశంలోని వివిధ కులాల పుట్టుపూర్వోత్తరాలను వెలికితీసి, ఆ కులాలలోని దురభిమానాన్ని పారద్రోలిన వారిలో సురవరం ప్రతాపరెడ్డి గారి తర్వాత పేర్కొన తగిన చరిత్రకారుడు డా॥ బి. ఎస్ ఎల్. హనుమంతరావు ఆయన రచించిన 'సోషల్ మొబిలిటి ఇన్ మిడీవల్ ఆంధ్ర'[24] (మధ్యయుగ ఆంధ్రలో సామాజికచలనం) లో అగ్రవర్ణాలుగా, కులాలుగా పరిగణించబడుతున్న వారి సామాజిక చరిత్రను నిష్పాక్షికంగా చిత్రించారు. ఒకవిధంగా అగ్రవర్ణాల అహంకారాన్ని చారిత్రకాధారలతో, కులనిర్మూలన స్ఫూర్తితో ఈ గ్రంథంలో ఆయన ప్రశ్నించారు. 'యుగ యుగాలుగా ఆంధ్ర బ్రాహ్మణుల కథ' అనే అధ్యాయంలో వైదిక రుషులు సైతం ఆర్యులు కారని అశ్వఘోషుడు వజ్రసూచీలో పేర్కొన్న విషయాన్ని డా॥ బి ఎస్. ఎల్. హనుమంతరావు మన దృష్టికి తెచ్చారు ఆయన కులనిర్మూలన పోరాటంలో వజ్రసూచి ప్రాధాన్యతను ప్రత్యేకంగా గుర్తించకపోయినా, వైదిక రుషుల గుట్టును రట్టు చేయడంలో అది ఎలా ఉపయోగపడుతుందీ తన విశ్లేషణ ద్వారా నిరూపించారు.

వర్ణవ్యవస్థ ప్రతిఘటనోద్యం ఆధునికయుగంలో ప్రారంభంకాలేదు. దానికిదాదాపు మూడువేల సంవత్సరాల చరిత్ర ఉంది ప్రాచీన భారతదేశంలో లోకాయుతులు, చార్వాకులు, జైనులు, బౌద్ధులు, ఆజీవకులు వర్ణవ్యవస్థను ప్రతిఘటించిన వారే. వీరెవ్వరూ బ్రాహ్మణాధిపత్యాన్ని, వర్ణ వివక్షను ఆమోదించరు వీరిలో చార్వాకులు, బౌద్ధులు మాత్రమే వర్ణవ్యవస్థకు వ్యతిరేకంగా నిరంతరాయమైన పోరాటం సాగించారు. బౌద్ధం ఒక క్రమపద్ధతిలో బ్రాహ్మణీయ భావ జాలానికి ప్రత్యామ్నాయంగా మానవ వాద సంస్కృతిని నిర్మించడానికి ప్రయత్నించింది వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా చార్వాకులు నిర్వహించిన వీరోచిత పాత్ర కాల గర్భంలో కలిసి పోయింది. ఆ చరిత్రను పునర్నిర్మించాల్సిన అవసరం ఎంతయినా ఉంది ప్రత్యర్థుల దాడులవల్ల వారిసాహిత్యం అంతరించింది లభిస్తున్న సాహిత్యాధారాల తోనయినా ఆ చరిత్రను వెలుగులోకి తేవాల్సిన అవసరం ఉంది. వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలోకి బ్రాహ్మణులను సయితం బౌద్ధం ఆకర్షించగలిగింది. ఎంతోమంది ''అగ్రవర్ణాల'' వారు బౌద్ధంలో చేరి వర్ణవ్యవస్థను విసర్జించారు వర్ణవ్యవస్థకు ప్రత్యామ్నాయ సంస్కృతిని నిర్మించగలిగారు. బౌద్ధం నానా జాతుల వారిని మానవతా సందేశంలో తనవైపు ఆకర్షించగలిగింది జన్మతః బ్రాహ్మణుడిగా పుట్టిన అశ్వఘోషుడు బౌద్ధుడై బ్రాహ్మణ వర్ణతిశయాన్ని విసర్జించి **(de-Brahmanised)**, బుద్ధుడి బోధనలకు తన సాహిత్యం ద్వారా ప్రజల్లో విస్తృత ప్రచారం కలిగించాడు తాను ఏ వర్ణంలోనయితే జన్మించాడో ఆవర్ణాధిపత్యాన్ని నిరసించే వజ్రసూచిని రచించి కుల నిర్మూలన వాదులకు ఆదర్శప్రాయుడైనాడు. బ్రాహ్మణ వాదానికి వ్యతిరేకంగా పోరాడినా జన్మతః బ్రాహ్మణలు అయిన వారి కృషిని కేవలం గుడ్డి బ్రాహ్మణ ద్వేషం వల్ల కొంతమంది పాక్షిక దృష్టిగల కుల నిర్మూలనవాదులు గుర్తించలేకపోతున్నారు వర్ణాతిశయాన్ని విసర్జించినవారు ఎవరయినా నిజమైన కుల నిర్మూలన వాదులకు మిత్రులే. ఎవరే వర్ణంలో, కులంలో పుట్టారనేది ప్రధానంకాదు ఎవరే భావజాలానికి ప్రతినిధులో ముఖ్యం. ఇది రెండు విరుద్ధ భావజాలాల మధ్యపోరాటం వ్యక్తుల మధ్య పోరాటం కాదు బౌద్ధ భిక్షు సంఘాలలో తమ పూర్వ వర్ణాతిశయ విసర్జన తొలిషరతని అందరికీ తెలిసిన విషయం. అలా తమ పూర్వ వర్ణాతిశయాన్ని విసర్జించిన వారిలో అన్ని వర్ణలవారున్నారు.

అందువల్ల వర్ణాతిశయ విసర్జన ఏదో ఒక వర్ణానికే పరిమితమైన చర్యకాదు. కుల నిర్మూలన ఏదో ఒక వర్గం గుత్త సొమ్ముకాదు. మానవ ప్రగతిని, వికాసాన్ని ఆకాంక్షించే ప్రతివ్యక్తీ తక్షణ సామాజిక బాధ్యత

మహాకవి అశ్వఘోషుడు నిజమైన మానవుడిగా తన బాధ్యతను గుర్తించాడు. కాబట్టి బ్రాహ్మణ వర్ణాతిశయాన్ని నిరసించి, వర్ణ వ్యవస్థ ప్రతిఘటనోద్యమానికి కావాల్సిన ఒక సైద్ధాంతిక ఆయుధాన్ని వజ్రసూచి రూపంలో మనకందించాడు దాని ప్రేరణతో కుల నిర్మూలనోద్యమాన్ని పటిష్టమైన సైద్ధాంతిక పునాది మీద నిలబెట్టాల్సిన బాధ్యత కులనిర్మూలన కోసం కృషి చేస్తున్న ప్రతి ఒక్కరిపైన ఉంది

**★ వజ్ర సూచి తెలుగు అనువాదాన్ని త్వరలో మిళింద ప్రచురణలు ద్వారా ప్రచురించ బోతున్నాము. దీని అనువాదకులు సుప్రసిద్ధ సాహిత్య పరిశోధకులు, సంస్కృతాంధ్ర పండితులు, బహు భాషా వేత్త డా॥ మలయశ్రీ. ఆయనకు నాస్తిక, హేతువాద ఉద్యమాలతో సన్నిహిత సంబంధాలున్నాయి.**

**నోట్స్ అండ్ రిఫరెన్సెస్ :**

1. J.K. Nariman, Literary History of Sanskrit Buddhism, Motilal Banarsidass, Delhi, 1972. P. 28.

2. డా॥ ముదిగంటి గోపాలరెడ్డి & డా॥ ముదిగంటి సుజాతారెడ్డి, సంస్కృత సాహిత్య చరిత్ర, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1986, పే 273

3. Rama Chaudhuri, Asvaghosha, Sahitya Akademi, New Delhi, 1991, పేజీలు 9-10 అశ్వఘోషుడి పేరుకు ముందు పేర్కొనబడ్డ విశేషణాలలో 'భదంత' పదంపై ఆచార్య సచ్చిదానందమూర్తి, డా॥ బి ఎస్. ఎల్ హనుమంతరావుల మధ్య ఆసక్తికరమైన చర్చ జరిగింది (చూడు డా॥ బి ఎస్ ఎల్ హనుమంతరావు, రెలిజియన్ ఇన్ ఆంధ్ర, త్రిపుర సుందరి, గుంటూరు, 1973, పేజీలు 326-327) ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి అభిప్రాయం ప్రకారం 'భదంత' అనే విశేషణం అశ్వఘోషుడు, నాగార్జున లాంటి స్థాయిగల దార్శనికులకే ఉపయోగిస్తారు. కాని తక్కువ స్థాయిగల వారికి లేక సిద్ధాచార్యులు లాంటి వారికి ఉపయోగించరు. ఈ అభిప్రాయంతో డా॥ హనుమంతరావు విభేదించారు. 'భదంత' అనే గౌరవ వాచకం బౌద్ధ దార్శనికుల గుత్త హక్కు కాదు. వి. ఎస్. ఆప్టే సంస్కృతాంగ్ల నిఘంటువు ప్రకారం a term of respect applied to a Buddhist.' బౌద్ధులకు అది గౌరవ పదంగా మాత్రమే ఉపయోగిస్తారు. అంతకు మించి ఆ పదానికి ప్రత్యేకత లేదన్నారు డా॥ హనుమంతరావు

4. రాహుల్ సాంకృత్యాయన్ ఓల్గానుంచి గంగకు, తెలుగు నేత: డా॥ చాగంటి తులసి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1992, పే 139., ఈ నవలలో పదకొండవ కథ 'ప్రభ' లో మహాకవి అశ్వఘోషుడి జీవితాన్ని చిత్రించారు.

అనువాదకురాలు అశ్వఘోషుడి రచనగా వజ్రచ్ఛేదని పేర్కొన్నది. వజ్రచ్ఛేది మహాయాన గ్రంథం ఇది జపాన్‌లో చాలా ప్రసిద్ధి చెందిన గ్రంథం వజ్రసూచికి వజ్రచ్ఛేది అనే మరో పేరు వ్యాప్తిలో లేదు బౌద్ధ సాహిత్య పరిశోధకులెవరూ ఈ విషయాన్ని పేర్కొన లేదు. రాహుల్జీ నవలలోని 'ప్రభ' కథ ఆధారంగా మనసుకవి ఆచార్య ఆత్రేయ 'అశ్వఘోషుడు' నాటిక రచించారు. ఒక మహాకవి జీవితాన్ని ఇతివృత్తంగా తీసుకొని ఓ మహాపండితుడు 'కథ'గా చిత్రిస్తే మరో గొప్ప కవి దానిని 'నాటిక'గా అత్యద్భుతంగా మలిచాడు ఇది సాహితీ చరిత్రలో అరుదైన సంఘటన. అశ్వఘోషుడు నాటిక కోసం ఆత్రేయ సాహితి, మూడవ సంపుటం (నాటికలు) సంపాదకుడు: కొంగర జగ్గయ్య, మనస్విని, పబ్లిక్ చారిటబుల్ ట్రస్ట్, మద్రాసు, 1990, పేజీలు 9- 42 చూడండి.

5 సంస్కృత సాహిత్య చరిత్ర పే 274

6 అశ్వఘోష, బుద్ధ చరితము, ఆంధ్ర వచనానువాదం దివాకర్ల వేంకటావధాని, సాహిత్య అకాడెమీ, న్యూఢిల్లీ, 1975 పే 4 దివాకర్ల వేంకటావధాని సాంప్రదాయ పండితులైనా అశ్వఘోషుడి జీవితాన్ని నిష్పాక్షికంగా చిత్రించారు సాంప్రదాయ పండితులెవరూ బౌద్ధుడైన అశ్వఘోషుడి కవిత్వ ప్రభావం బ్రాహ్మణ మతకవి కాళిదాసుపై ఉందనే విషయాన్ని అంగీకరించరు వేంకటావధాని అటువంటి సంకుచితమత ద్వేషాన్ని విడనాడినట్లు తొలిపలుకు చదువు తుంటే అనిపిస్తుంది.

7. జె కె నారిమన్ రచన లిటరరీ హిస్టరీ అఫ్ సాన్‌స్క్రిట్ బుద్ధిజం, పేజీలు 32-33.

8 కాళిదాసు, రఘు వంశము (రెండవ భాగము) తెలుగు అనువాదం : కేశవ పంతుల నరసింహ శాస్త్రి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాద్, 1982, పేజీలు 241 - 286.

9. శరద్‌పాటిల్, భారత ప్రజాతంత్ర విప్లవ సమస్యలు, తెలుగు అనువాదం ఏటుకూరు బలరామమూర్తి, మిళింద ప్రచురణలు, గుంటూరు, 1996, పే. 5.

10. దివాకర్ల వేంకటావధాని, బుద్ధ చరితము, తెలుగు అనువాదం, పే. 2

11 K. Satchidananda Murty, Evolution of Philosophy in India, Andhra university, Waltair, 1952. P. 199 .

12. Asvaghosha, Vajrasuchi, Editid by Lallaṇji Gopal, Mahabodhi Society of India, Mulagandhakuti Vihara Sarnath 1995 ' పేజీలు 56 ప్రొఫెసర్ లల్లాంజిగోపాల్ 39 పేజీల పీఠికతో వజ్రసూచి సంస్కృత మూలంతో పాటు వజ్రసూచికోపనిషత్తును అనుబంధంగా ఇచ్చారు. దీన్ని ప్రొఫెసర్ లల్లాంజిగోపాల్ విశేష పరిశోధన చేసి వెలువరించారు వారి కృషి శ్లాఘనీయం. ప్రస్తుత వ్యాసకర్త వారి పీఠికపై కొంతవరకు ఆధారపడ్డాడు. అయితే వర్ణ వ్యవస్థ యెడల గౌతమ బుద్ధుడి అభిప్రాయాల గురించి ఆయనరాసినదానితో ఏకీభవించలేదు. పాలీపిటకసాహిత్యాన్నంతా యథాతథంగా అంగీకరించి దానిలోని భావాలన్నీ బుద్ధుడికి అంటగడితే అది బౌద్ధానికి అన్యాయం చేసినట్లే కాగలదు. వాటిలో కూడా ప్రక్షిప్తాలున్నా యని పాలీపండితులు అంటున్నారు.

అందువల్ల వాటిలో ఏవి బుద్ధుడు చెప్పినవి, ఏవి ప్రక్షిప్తాలు అనేది శిక్షసముచ్చయంలోని ఈ సూత్రాన్ని అనుసరించి గుర్తించాలి యద్కించిద్ సుభాషితమ్, తద్ సర్వమ్ బుద్ధ భాషితమ్'' (Whatsoever is rightly spoken and free from error, that is the teaching of the Buddha). వివేచనకు, అనుభవానికి నిలవనిది ఏదీ బుద్ధుడి బోధ కాదని ప్రొఫెసర్ పి లక్ష్మీ నరసు అన్నారు

13. బోధచైతన్య, లోకక్షేమగాధలు (ధమ్మపదం గాధలు) 1997, పే 111.
14 లల్లాంజిగోపాల్ ఎడిట్ చేసిన అశ్వఘోషుని వజ్రసూచి పే 7 చూడండి. అలాగే జె.కె. నారిమన్ రచన లిటరరీ హిస్టరీ ఆఫ్ సాన్స్క్రిట్ బుద్ధిజం పే 38
15 లల్లాంజి గోపాల్ ఎడిట్ చేసిన వజ్రసూచి పేజీ 15 చూడండి
16 టి రవిచంద్, సామాజిక విప్లవ దార్శనికుడు డా॥బి ఆర్ అంబేద్కర్, చైతన్య పబ్లికేషన్స్ 1989, పేజీ 59.
17. V.R. Narla, Man and his world (Further Extracts from notebooks of a humanist) scientific services, Hyderabad, 1984, P. 19.
18. Dr. S. Radhakrishnan, The Principal Upanishands, Oxford Publications, Madras, 1989 PP 935 - 937.
19. Dr. Rammanohar Lohia, Fragments of a world mind 1950. ఈ గ్రంధంనుండి హిందూఇజం అనే వ్యాసాన్ని సోషలిష్టు మిత్రులు రావెల సోమయ్య పంపగా చదివాను. ఆయన పంపిన జిరాక్స్ కాపీలో గ్రంధప్రచురణ వివరాలు లేవు.
20. వేమన పద్యాలు (సి.పి. బ్రౌన్ 1839 నాటి సంకలనం), సంపాదకుడు. బంగోరె, యోగి వేమన తెలుగు విజ్ఞాన కేంద్రం, హైదరాబాద్, 1980, పేజీలు XXXIII - XXXIV.
21 సురవరం ప్రతాపరెడ్డి. వ్యాసాలు రెండవ భాగం, సురవరం ప్రతాపరెడ్డి సాహిత్యవైజయంతి, హైదరాబాద్, 1988, పేజీలు 33-34.
22. P. Lakshmi Narasu, A Study of Caste, Asian Education Services, New Delhi, 1988, PP. 43, 46.
23. K.B. Krishna, "Political and Social thought of the Buddhist Writers", Visalandhra Publishing House, Vijayawada, 1960, P.P. 4-12.
24. Prof. B.S.L. Hanumantha Rao, Social Mobility in Medieval Andhra, Telugu University, Hyderabad, First Edition : 1995, P. 3. ఈ గ్రంధం తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆంగ్ల ప్రచురణగా వెలువడక ముందే, 1993లో ఆంధ్రలో సామాజిక చలనం పేరుతో ఏటుకూరు బలరామమూర్తి తెలుగులోకి అనువాదం చేసి, విశాలాంధ్ర ప్రచురణగా వెలువరించారు కులనిర్మూలన దృష్టితో చరిత్ర రచన ఎలా చేయాలో తెలుసుకోవాలకొనే వారందరికి ఇది ఒక మోడల్ (నమూనా) గ్రంధం.

# మానవతా - సాహితీ మూర్తి తిరుమల రామచంద్ర

(తిరుమల రామచంద్ర ఈనెల 12వ తేదీ ఉదయం 4 30 గంటలకు నిమ్స్‌లో దివంగతులయ్యారు వారిని సంస్మరించుకొంటూ, వారి సాహితీ మూర్తిమత్వా విష్కారం చేస్తున్నాము ఈ వ్యాసంలో - సంపాదకుడు)

- డా. ఈమని శివనాగిరెడ్డి

- కె. జితేంద్ర బాబు

స్వేచ్ఛను అందరికీ ఆశించడం మానవత్వంలో ఒక అంశం కదా! కనుక, నేను ఎవరిస్వేచ్ఛకు అడ్డుకాదలచ లేదు. నా లక్ష్యం మానవత్వం, అది చిరంజీవి. నేనూ చిరంజీవిని'', అని పలికిన విజ్ఞానజిజ్ఞాసువు తిరుమలరామచంద్ర మరణించారంటే నమ్మశక్యంగాకుండా వుంది.

''విద్యా దదాతి వినయం'' తిరువుల రామచంద్ర విషయంలో అక్షరాల నిజం. 'జ్ఞాన'పరమార్థం, సంస్కారం, వినయంతో కూడుకొన్న సత్యగవేషణ' అని తెలియచెప్పిన మనస్వి, కళాతపస్వి, రామచంద్ర భాషా పండితులలో లేని చరిత్ర జిజ్ఞాస, పరిశోధనా దృష్టి వీరిలో ఉంది. దీనివల్లె నవీనులలో నవీనుడైనాడు, చరిత్రజ్ఞులలో చరిత్రజ్ఞుడైనాడు పరిశోధకులలో మహా పరిశోధకుడైనాడు. తెలుగు, తమిళ, కన్నడ, ప్రాకృత, సంస్కృత, ఆంగ్ల, హిందీ భాషా స్వరూపాల్ని ఔపోసన పట్టి, ఆయాభాషాసాహిత్యాల అంచులు చూసి, లోతులు తీసి, సాదృశ్య వైదృశ్యాల సమ్యక్దృష్టిలో మధించి, తెలుగు జాతికి అందించిన ప్రజ్ఞావంతుడు తిరుమలరామచంద్ర. ఈ బహుభాషా పాండిత్యం తెలుగుకుకొత్త వెలుగులు గూర్చటానికి దోహదం చేసింది జీవచ్ఛక్తులతో, వాటి వైవిధ్యంతో వాటి విద్యుద్గమనంలో, వాటి విన్యాసంలో ప్రేరేపింపబడీన విద్వద్వరేణ్యులు తిరుమల రామచంద్ర ''కొత్తపాతల మేలుకలయిక''గా నిలిచాడు.

ఎనభైనాలుగు సంవత్సరాలనాడు అనంతపురంలో జన్మించి, అనంత విశ్వం తనదేనని ''హంపి నుండి హరప్పా'' దాక సంచరించాడు తిరుపతి సంస్కృత కళాశాలలో సంప్రదాయ వ్యాకరణం, తర్కంచదువుకొంటూనే, గోవిందరాజస్వామిగాలిగోపురంపైకాంగ్రెసు జెండాను ఎగురవేశాడు తిరుపతిలో మొదటిసత్యాగ్రహిగా సంవత్సరకాలం జైలుకెళ్ళి కమ్యూనిస్టుగా బయటకు వచ్చాడు. సంస్కృత కళాశాల వారు వద్దు పొమ్మంటే మద్రాసు చేరి కుట్ర కేసులో ముద్దాయి అయి టంగుటూరి ప్రకాశంలాంటి పెద్ద పెద్ద లాయర్లకు పనిగల్పించాడు కుట్రకేసునుండి బయటపడి రాజకీయాలకు 'స్వస్తి' పలికి 'సాహితీ సుగీతుడుగా మారాడు'' సంప్రదాయ విద్యలో ప్రజ్ఞ సంపాదించి, సృజనాత్మకతతో సరళసుందర వ్యాసాలు 'భారతి'లో అరవై ఏళ్ళనాడే రాయటం ప్రారంభించాడు.

---

**డా. ఈమని శివనాగిరెడ్డి** ప్రఖ్యాత పురాశాసన వ్యాఖ్యాత, ఆర్కియాలజీ శాఖలో పనిచేస్తున్నారు.

**కె. జితేంద్ర బాబు** అడ్వొకేట్‌గా, పురావ్రాత ప్రతుల సంచయనకర్తగా పరిశోధకుడుగా ప్రసిద్ధులు.

తెలుగు భాషా నుడికారాన్ని, పద పదార్థ బంధాన్ని అర్థం చేసుకొని 'నుడి - నానుడి'గా అందించారు 'తెలుగు పత్రికల సాహిత్య సేవను' కథలా వినిపించారు ఎవరు పలికినా 'మనవి - మాటలు' అన్నాడు. సాహిత్య విశేషాలను తెలుపుతూ 'సాహితీ సుగతుని స్వగతం'' వినిపించాడు కావ్య రసాస్వాదనలు చూపి, కాకతీయుల యుద్ధవ్యూహాలు తెలిపి, కళాపూర్ణోదయ విశిష్టతను నిలిపాడు ''బృహదారణ్యకమ్'' లో.

మానవ పరిణామంలాగానే ''మనలిపి పుట్టుపూర్వోత్తరాలు'' ఎలా పరిణామం చెందాయో సులభంగా గ్రంధస్థం చేసాడు.

తెలుగు ప్రాకృతాల మధ్య ఆదాన ప్రదానాలు జరిగాయని రెండిటికి జన్య జనక సంబంధం ఉందని ''గాధాసప్తశతిలో తెలుగు పదాలు''ను ఎత్తిచూపాడు ''ప్రాకృత వాఙ్మయంలో రామకధ''ను తెలుగు వారికి వినిపించాడు. ఈ విశ్వం వైవిధ్య విలసితం. ప్రతివ్యక్తిలోనూ ఏదో మంచి, ఏదో మించు కనిపిస్తుంది సహృదయంతో చూస్తే, నేను పత్రికా రచయితగా ఈ మంచిని, మించును చూడడం నేర్చుకొన్నాను అంటూ తనకు తారసిల్లిన ఎందరో ప్రముఖులకు ''అహంభో అభివాదయే'' అంటూ ప్రణామాలు అర్పించాడు.

'పరిశోధకుడిగా 'పరిశోధన' పత్రికా సంపాదకుడిగా, ధర్మవరం కృష్ణమాచార్యుణ్ని పాల్కురి సోమనాధుణ్ని, గురుజాడను, వేటూరి ప్రభాకరశాస్త్రుల్ని స్మరించుకొని స్మారక సంచికలు వెలువరించాడు. ''అవధానకల్పలత''ను, ''లలిత విస్తరం'' ''హారమేఖల''లను అందించి అన్య భాషాసొగసులు చూపించాడు.

'ఆత్మలేదు' నాశనములేని ఆత్మగలదను వాదం సహేతకం కాని నిరాధారమైన నమ్మిక, అని నాగసేనుడు ఎలా 'మిళిందపఞ్హా'లో దేని ఆధారముగా అన్నాడో తెలుగువారికి తెలుపుదామని, ప్రయత్నిస్తూనే తిరుమల రామచంద్ర అకస్మికంగా ప్రకృతిలో తాదాత్మ్యం చెందాడు.

మానవ వికాసాన్ని అనుసరించి భాషా వికాసం, భాషావికాసాన్ని అనుసరించి మానవ వికాసం ఉంటుందని అన్యోన్యాశ్రయంతోనే అనాదినుండి అభివృద్ధి జరుగుతుందన్న భావంతో సద్యః భాషల సాంగత్యం, ప్రజల మధ్యసాన్నిహిత్యం సకల భాషల సాంకర్యం కోరాడు. తెలుగుభాష ఎన్నో సాంకర్యాలతో వెలసిల్లిందని నిరూపించాడు సంస్కృత, ప్రాకృత, తమిళ, కన్నడ, ఆంగ్ల, హిందీ భాషల వ్యాక్య నిర్మాణరీతులు, శబ్ద ప్రయోగాలు, వైవిధ్యాలు తెలుగువారికి నేర్పించాడు అన్ని ప్రయోగాలు గ్రాహ్యాలే 'పరిత్యాజ్యాలు లేవు' అని అన్యభాషారీతులను తెలుగు వారికి నేర్పించాడు

తాను చిరంజీవి, తన ప్రయోగాలు చిరంజీవాలు, తనలక్ష్యం చిరంజీవి, అంటూ వెళ్ళిపోయాడు భాషాసేవకుడు తిరుమల రామచంద్ర.

# తమిళ విప్లవకవి భారతీదాసన్ స్మృతిలో-

- డా. దేవరాజు మహారాజు

ఈ శతాబ్దపు పేరెన్నికగన్న తమిళకవులలో భారతీదాసన్ ఒకరు. తమిళసాహిత్య ప్రపంచంలో సుబ్రహ్మణ్య భారతి తర్వాత స్థానం భారతీదాసన్ దే. 1930 నుండి మూడు దశాబ్దాల పాటు తమిళ కవితా రంగాన్ని తన వెంట నడిపించి, అభ్యుదయ తమిళ కవితను ఒక కుదుపు కుదిపి, మలుపు తిప్పిన వారు భారతీదాసన్ (1891-1964) ఆయన తమిళకవిత్వానికి పర్యాయపదం హేతు వాదానికి, విప్లవ చైతన్యానికి, తమిళ పాటకు ప్రతీక।

భారతీదాసన్ పదిహేడేళ్ళ వయసులో సుబ్రహ్మణ్య భారతిని కలుసుకున్నాడు. ఆయన కవితా ఝరిలో పడికొట్టుకుపోయి, ప్రభావితుడై తనను తాను సుబ్రహ్మణ్య భారతికి శిష్యుడిగా ప్రకటించుకున్నాడు. భారతీదాసుడిగా మారాడు. క్రమంగా అభిమాని కవిగా రూపాంతరం చెందాడు ఆయన అసలు పేరు కనక సుబ్బరత్నం. సుబ్రహ్మణ్య భారతి అడుగుజాడల్లో రచనలు చేస్తూ, ఆయన ఆలోచనలకు, ఆశయాలకు రూపకల్పన చేస్తూ సాహిత్య ప్రపంచంలో అడుగు పెట్టిన భారతీదాసన్, ఆ తరువాత తనదైనశైలిలో సుమారు యాభైపుస్తకాలు ప్రకటించారు. ఇందులో కవిత్వం, నాటకం ప్రధానమైనవి. తొలిదశలోనే అంటే 1937లోనే సినిమారంగంలో ప్రవేశించి కథ మాటలు, పాటలూ రాసి జనానికి ఎంతో చేరువయ్యారు కూడా హేతువాదిగా రాజకీయ నాయకుడిగా కూడా ఆయన జన హృదయాల్లో చెరగని ముద్ర వేశారు. మద్రాసు మెరీనాలో ఆయన నిలువెత్తు విగ్రహం అందుకు ఒక ఉదాహరణ.

తొలి యవ్వన ప్రాయంలో దైవభక్తుడిగా ''శ్రీ మయిలమ్ సుబ్రహ్మణ్యార్ తుటియామతు'' పేరుతో 1926లో దైవ కీర్తనల పుస్తకం ప్రకటించిన భారతీదాసన్, నాలుగేళ్ళలో జాతీయవాదిగా మారారు. 1930లో ''కాదర్ ఇరాటినప్ పట్టు'' ( ఖాదీ చెరఖాపై ఒక కవితా ఖండిక) ప్రకటించారు ఇవియార్ పెరియార్ ప్రభావానికి లోనై అనతి కాలంలోనే నిరీశ్వర వాదిగా రూపాంతరం చెందారు. ఇక అప్పటి నుండి తన రచనల్లో సమాజ రుగ్మతలకు రూపుకట్టిస్తూ, హేతువాదపు గొప్పతనాన్ని వెలికి తీస్తూ, ప్రశ్నించడం, అన్యాయంపై తిరగబడడం వంటి అంశాల్ని జొప్పిస్తూ అభ్యుదయ తమిళ కవిత్వంలో ఒక అలజడి సృష్టించారు. 1938-77ల మధ్య ''భారతీదాసన్ కవిత్తైక్కళ్'' (భారతీదాసన్ కవితా ఖండికలు) నాలుగు సంపుటాలుగా వెలవడ్డాయి. ఈ సంపుటాలు జనాన్ని విప్లవ ధోరణిలో ఆలోచింపజేస్తూ ఊహకు మించిన ప్రాచుర్యాన్ని పొందాయి. అజాకిన్ సిరుప్పు (అందపు చిరునవ్వు 1944) కతల్ నినైవుకల్ (ప్రేమ జ్ఞాపకాలు 1944) తమిళ ఇయక్కం ( తమిళ ఉద్యమం 1945) వంటి అనేక లఘుకావ్యాలు, కథాగేయాలు జనాన్ని వెన్నుతట్టి లేపాయి కవితా సంపుటులే కాదు 1940లలో రాసిన వీరి నాటకాలు కూడా ఎంతో ప్రసిద్ధి పొందాయి. ఎదిత్ పరాత ముత్తం ( ఊహించని ముద్దు) కుటుంప విలక్కు (కుటుంబ జ్యోతి - ఐదుభాగాలు) పానియన్ పరిశు (పానియన్ బహుమతి) మొదలైనవి

తమిళ భాష, సంస్కృతీ, సంప్రదాయాల ఔన్నత్యాన్ని తెలియజేయడం వీరి రచనల ప్రత్యేకత. సునిశితమైన పరిశీలనతో, సులభమైన శైలిలో తిరగబడే పాత్రల్ని, సమాజాన్ని ప్రశ్నించే పాత్రల్ని ఆయన సృష్టించారు. నమ్రతగా, మెత్తగా మాట్లాడే మాటల్లోనే అగ్గి కురిపించే

---

★ **డా. దేవరాజు మహారాజు** ప్రముఖ కథానికా రచయిత న్యూసైన్స్ కళాశాల, హైదరాబాద్‌లో జంతుశాస్త్ర శాఖలో రీడరుగా పనిచేస్తున్నారు.

విప్లవ భావజాలాన్ని వెలువరించారు అంతేకాదు క్రీ శ 2వ శతాబ్దపు జంట కావ్యాలు ''శిలా ప్పదికారం'' ''మణి మేఖలై'' లను మళ్ళీ తనదైన విప్లవశైలిలో తిరగరాశారు భక్త ప్రహ్లాద వంటి భక్తి ప్రధానమైన నాటకాలు ఆదరింపబడుతున్న రోజుల్లో ఒక సామాజిక సమస్యను తీసుకుని, ఒక ఇరానీ వాడిని హీరోగా నిలబెట్టారు'' ఇరానియన్ అల్లతు ఇనైయఱ్ర వీరన్ ( ఇరానియన్ ఎదురులేని హీరో 1939) అలగే నల్ల తురుప్పు (సరైన సాక్ష్యం, 1944) పొట్టిట్ట పెంకల్ (చదువుకున్న అమ్మాయిలు 1948) సిరా తాండవం 1943 కుజె కుట్టియన్ కతల్ మొదలైనవి ''పిసిరాంతయార్'' 1967లో అచ్చయిన నాటకానికి మరణానంతరం 1969లో కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు లభించింది

పుట్టి, పెరిగి తమిళ ఉపాధ్యాయుడిగా ఉద్యోగం చేసిన పాండిచేరి నుండే భారతీ దాసన్ తన 63వ యేట అంటే 1954లో అసెంబ్లీ సభ్యుడిగా ఎన్నికయ్యారు సంగీతమన్నా, తమిళపాటన్నా చెవి కోసుకునే ఈ కవి, తమిళులు కచేరీల్లో తమిళ పాటలే పాడాలన్న ఉద్యమం కూడా లేవనెత్తారు ఆయన రాసిన నలభై వేల కవితా చరణాలు ఇప్పటికీ తమిళుల హృదయాల్లో విప్లవ గీతాలుగా మారు మ్రోగుతూనే ఉన్నాయి 1964లో భారతీదాసన్ మరణించిన తర్వాత, ఆయన స్మారకార్థం తమిళనాడు ప్రభుత్వం ప్రతియేటా ఒక కవికి అవార్డు ప్రకటిస్తోంది

---

# HUMANISM FOR HUMAN DEVELOPMENT AND HAPPINESS

### 14TH IHEU WORLD CONGRESS

Sunday 10 January 1999 - Thursday 14 January 1999 Bombay, India

The IHEU is pleased to announce its next World Congress to be held in Bombay (new name Mumbai), India, at the M N Roy Human Development Campus, the World's largest Humanist Campus

Humanism is ancient tradition in India and humanist group are flourishing in the Indian sub-continent, involved in a variety of practical and intellectual work

Congress registrants will have ample opportunities to see Humanism at work, to exchange ideas with leading thinkers and activists from many countries and to take part in cultural and social programmes

Concessions to previous IHEU Congress participants and special registration rates for particiapnts from the Third World are available

Congress dates make it possible to take advantage of good weather and off-peak airline fares

Advance Registration is highly recommended For Registration, accommodation possibilities and other travel arrangements in connection with the Congress, write to

Dr Indumati Parikh, President, Indian Radical Humanist Association, 276, Telang Road, Bombay 400 019 India, Tel + 91 22 41 41 702, Fax + 91 22 41 35 248, E Mail mrcssc@bom2 vsnl net in

# Wilde's grandson calls film 'gay - obsessed'

## INVITATION TO PREMIERE REFUSED

DALYA ALBERGE

LONDON, Oct, 10 - The grandson of Oscar Wilde yesterday accused the makers of a film biography of concentrating on his homosexuality to the exclusion of almost all else, including his genius

Mr Merlin Holland (51), Expressed outrage and regret at a lost opportunity "This is a film which at best leaves those people unfamiliar with Wilde with an impression of him as a man who jumped in and out of bed with young men "

His homosexuality, for which the dramatist was sentenced in 1895 to two years' hard labour in prison, should have been only part of the film, Mr Holland said Shortly after reading the script, and feeling that his criticisms were falling on deaf ears, Holland, a writer, turned down a #5,000- fee to be a consultant

He has refused an invitation to the premiere of Wilde which opens next Friday in Britain, starring Stephen Fry, claiming that the makers had gone beyond artistic licence

"When they found the film was too long, they cut the only two real literary scenes about his life as a journalist and the reception of Dorian Gray "

He added "If I went to the premiere, people would be coming up, saying "Isn't it a wonderful film' or "What do you think of the film?' I don't want to be put in that position."

He claims that, of 109 scenes, 11 feature physical contact of a sexual nature, while a further 30 touch on homosexuality through dialogue or body language, "And that's not to mention the trials

One of the most offensive scenes, he said, featured Wilde playing voyeur to Alfred "Bosie" Douglas with a rent boy at the Savoy, for which Holland said there was no evidence

It was the scandalous affair with Douglas that led to Wilde's downfall. His wife, Constance, fled the country with their two sons and changed the family name to Holland.

Her grandson spoke of being disturbed by a scene showing photographs of half-naked Sicilian fisherboys being found in Wilde's desk. "That gives it a sort of grubby feel which I can't believe was there, given what we know about him. It turns Oscar into a dirty paedophile "

He contrasted Wilde with two earlier films, starring Robert Morely (1959) and Peter Finch (1960) Both were so prim that they failed to show the lovers even holding hands Wilde, he said, had gone to the other extreme and failed, to balance his homosexuality with his love for his family.

Mr Holland also criticised minor factual errors and questioned why Wilde's first trial had been distorted In the film, the first trial ends with Wilde going to his solicitor's office and confirming that he is withdrawing his libel action against the Marquess of Queensberry, Douglas's father "What happened was more dramatic. He withdrew in open court "

Hearing of the criticisms, Marc Samuelson, co-producer of the film, said "I don't regard Merlin Holland as a film critic of any note So whatever he may think is negated by some of the astoundingly positive reviews we've had.

"He also has a book to sell-which is coming out, funnily enough, at the same time as the film. It absolutely does not sensationalise anything Anyone who sees the film will make up their own minds about that "

The director, Brian Gilbert, said of Mr Holland. "I've had many conversations listened very attentively to him. But the evidence about anyone's sexual life is largely speculative "

Commenting on the voyeuristic scene, he said: "What it expresses is what went on between Wilde and Bosie. As far as we can tell, their own sexual relationship was over very soon. Of what went on behind closed doors, there is little evidence, apart from what others witnessed at the hotel. We do know he led Oscar into rough trade."

**— The Times, London**

# సరళా భారతము - పరిచయం - పరిశీలన

-కె. ఎమ్. వి. జి. కృష్ణమూర్తి

తెలుగు సాహిత్యానికి నన్నయలాగే ఒరియాసాహిత్యానికి సరళాదాసు ఆద్యుడు ఈయన్ను కూడా ఒరియా సాహిత్యపు ఆదికవిగా పేర్కొంటారు ఒరియాసాహిత్యపు అత్యుత్తమ పురస్కారాన్ని 'సరళా పురస్కారం'గా నేడు వ్యవహరిస్తున్నారు

భారతాన్ని చారిత్రిక కారణాల మూలంగా కవిత్రయం ఆంధ్రీకరించగా, సరళాదాసు మొత్తం భారతాన్ని ఒరియా భాషాంతరీకరణంచేసాడు సరళాదాసు పుట్టుపూర్వోత్తరాలు, చారిత్రికాదాలు విభిన్నకథనాలతో వివాదాస్పదాలుగానే ఉన్నాయి మహాభారతం ఆదిపర్వంలో సూర్యవంశీకుడు కపిలేంద్ర చంద్రదేవుని (క్రీ శ 1452 - 1479) పేర్కొన్న కారణాన ఈయన సమకాలికుడిగా చెప్పుకోవచ్చు అంతకు పూర్వమున్న ఒరియా సాహిత్యం, తామ్ర పత్రాలకే పరిమితమైనందున సరళాదాసునే ఒరియా సాహిత్యానికి ఆద్యునిగా చెప్పుకోవలసివస్తుంది నన్నయ కు పూర్వం ఆంద్ర సాహిత్యం పరిస్థితి కూడా అదేకదా! (భూ ॥ ఆంధ్ర వాఙ్మయ చరిత్రము - దివాకర్ల వేంకటావధాని)

సరళాదాసు మహాభారతమే కాక 'విలంకారామాయణం' 'చండీపురాణం' అనే గ్రంధాలను కూడా రచించాడు.

సరళాదాసు అసలు పేరు సిద్దేశ్వర పరిడా 'విలంకారామాయణ' కాలానికికూడా అలాగే చెప్పుకున్నాడు తరువాతికాలాన, ఝుంకడావాసిని, ఇష్టదేవతా ఐన సరళాదేవి అనుగ్రహంతో సరళాదాసు అయ్యాడు. పుట్టుకతోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్నాడు చిత్రోత్పలా నదీతీరపు ఉత్తర ప్రాంతమైన జంఖాపుర ప్రాంతంలో సరళాగ్రామంలో సరళాదాసు జన్మించాడని చారిత్రికుల అభిప్రాయం.

సరళామందిర సమీపాన గల కాళీనాగ గ్రామంలో జన్మించాడని స్థానికులంటారు ఈయన శాక్తేయుడు ఆదిలో శక్తి పూజ శూద్రులకే పరిమితమై ఉండేది అలా పూజించే శూద్రులను 'ముని' లని వ్యవహరించేవారు. అందువల్లనో లేక వ్యాసుడు స్వయంగా బ్రాహ్మణుడు కాకున్నా భగవద్గీతలో ''మునీనామప్యహం వ్యాసః'' అని చెప్పుకున్నందునో తనుతాను ''శూద్రముని''గా చెప్పుకున్నాడు సరళాదాసు

తమ పూర్వీకులైన పాండవుల చరిత్రను ఆంధ్రీకరించమని చంద్రవంశపు రాజు రాజనరేంద్రుడు కోరగా నన్నయ భారతాంధ్రీకరణ చేపట్టడు. సరళాదాసు సరళాదేవీ ప్రసాదలబ్దుడై, స్వప్నంలో ఆదేశించినందున భారతాన్ని అనువదించాడు. తనను తాను ''మూర్ఖ'' అపండితునిగా చెప్పుకున్నాడు. కాని సరళాభారతంలో ఆయన బహుశాస్త్ర పాండిత్యం, సంస్కృత భాషా భినివేశం ఎల్లెడలా కనపడుతుంది

---

★ **కె.ఎమ్.వి.జి. కృష్ణమూర్తి** రిజర్వ్ బ్యాంకు, హైదరాబాద్‌లో పనిచేస్తున్నారు మంచి రచయిత

సరళాభారతం వ్యాసభారతానికి స్వేచ్ఛానుసారమే కాని కవిత్రయభారతంలా మూలాన్ని వీలైనంతవరకూ అనుసరించి చేసిన అనువాదం కాదు లక్షశ్లోకాలున్నట్టు చెప్పుకునే భారతాన్ని సరళానువాదం లక్షానలభైవేల పదాలుగా (ద్విపదవంటిది) రూపొందింది. విలంకారామాయణం, చండీ పురాణం కూడా స్వేచ్ఛానుసరణలే. దాదాపు స్వతంత్ర రచనలుగానే చెప్పుకోవచ్చు మూలకథను మాత్రమే తీసుకుని చేసిన రచనలు అవి

రామాయణ మహాభారతాలను ఆధారంచేసుకుని జైనులు తమదైన రీతిలో ధర్మ ప్రచారానికి ఆయా కథలను మార్చుకున్నారు. ఏడెనిమిది శతాబ్దుల జైనకవి 'స్వయం' రామాయణంలోని సీత రావణ మండోదరుల సంతానం తమ వంశానికి చేటు తెస్తుందని చెప్పిన అ శరీరవాణి మాటలునమ్మి ఒక పెట్టెలో పెట్టిన శిశువు. జనక మహారాజుకు లభించిందిట ద్రవిడ రామాయణంలో కూడా అలాగే వర్ణించారు. వైదిక మతద్వేషులైన జైనులు, తమ సిద్ధాంత ప్రచారంకోసం అలారాశారు. సరళాదాసుకూడా భారతంలో శ్రీకృష్ణపాత్రను వారి మాదిరిగానే చిత్రీకరించాడు.

ఆయన కాలంలో ఒరిస్సాలో వైష్ణవం వెర్రితలలు వేసింది రాధామాధవ ప్రణయం జుగుప్సాకరంగా వర్ణితమైంది. ఆధ్యాత్మిక జీవనం కలుషితమైంది. శ్రీకృష్ణ - సహజసుందరీ ఉపాఖ్యానం ద్వారా ఈ ధోరణులను నిరసించాడు మరెన్నో ఉపాఖ్యానాలనూ అమూలకాలనూ తన భారతంలో చొప్పించాడు. ఆనాడు బౌద్ధశాఖలైన వజ్రయాన, సహజయాన మత ప్రభావంతో లైంగిక విశృంఖలత చోటుచేసుకుంది. వీటిని నిరసిస్తూ, శ్రీకృష్ణ - సహజసుందరీ సంగమంతో పుట్టిన ఖనికావృత్తాంతం ద్వారా పరకీయవ్యభిచారాన్ని నిరసించి, శ్రీకృష్ణుడు పరదారాసంగమంతో దర్పహీనుడై పాపానికొడిగట్టాడని' వర్ణించాడు.

'వనపర్వం' (అరణ్యపర్వం)లో 'సత్య - అంబ' ఉపాఖ్యానంలోనూ, సభాపర్వంలోని 'జరాసంధవధ' లోనూ సరళాదాసుకల్పనాకౌశలం కొట్టొచ్చినట్టు కనపడుతుంది. కాశీరామదాసు 'వంగ' మహాభారతం పైన కూడా వీటి ప్రభావం పడింది. సరళాభారతం ఒకప్పుడు వంగదేశంలోకూడా బహుళ ప్రచారంలో ఉండేదని బి.సి. మజుందారు వంటి వంగపండితుల అభిప్రాయం.

సరళాభారతంలో నాటి జీవన పరిస్థితుల చిత్రీకరణ కనపడుతుంది. ద్రౌపదీ - హిడింబిల కలహప్రసంగం, సపత్నీ విరోధం జనసామాన్యంలోంది తీసుకుని చిత్రీకరించినదే. మామూలు సవతుల్లా పరస్పరం తిట్టుకుంటారు. దీన్నికాశీరామదాసు వంగ మహాభారతంలో యధాతధంగా వాడుకున్నాడు.

సరళాదాసు మహాభారత కథలనుంచి ఒరియాజన జీవన స్రవంతిలో ఎన్నో సామెతలు నుడికారాలు చోటుచేసుకున్నాయి

''గంగ ఉంటానంటే గంగిపోతానందిట''

''పూరింటి పడుచుకు పెద్దింటి వరుడు''

''మొదట్లో భీముడు ఓడతాడు'', ''మహమ్మారీభయం'' వంటి నానుడులు సరళా భారత కథలనుంచి పుట్టినవే దీన్ని బట్టి ఈ గ్రంథం జనసామాన్యాన్ని ఎలా ప్రభావితం చేసిందో ఊహించుకోవచ్చు

తెలుగులో కూడా ఇలాంటి నానుడులున్నాయి.

'' ఏమిటాయక్ష ప్రశ్నలు?''

''కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు''

''శల్యసారథ్యం'' వంటి మాటలు తెలుగునాట కూడా సాధారణమేకదా!

సరళాభారతంలో ఒరిస్సా సమకాలీన కథా చిత్రణ, సామాజిక జీవనం, అర్థనీతి, భూరాజస్వవిధానాలు, సైనికవ్యవస్థ, రణనీతి, నాథపంథీ, శూన్యవాదుల యోగసాధనా విధానాలు, ఉల్కావిద్య, భూరప్రేత స్తంభనవిద్య, భార్యాసంగమ విధులు, వ్యవసాయ, వాణిజ్యరీతులు, మొదలుకుని ఇటుకల తయారి వరకూ సరళాదాసు స్పృశించని విషయం లేదు అందుకనే (సరళా) ''భారతంలో లేనిది భారతం లోనేలేదు'' అనే నానుడి ఏర్పడింది.

కాని సరళాదాసు భారతంలో తరువాత లేఖకులు ప్రక్షేపించినదీ, సరళాకృతమైనదీ నిర్ధారించడం సాధ్యపడదు.

'విలంకారామాయణం' 'మహాభారతం' కూడా 'దాండీ' వృత్తంలో రచించబడ్డాయి. ఈ వృత్తాన్ని ఒరియా సాహిత్యంలో ప్రవేశపెట్టింది కూడా సరళాదాసే పదాల అక్షరసంఖ్యలో అసమానత ఈ వృత్త లక్షణం ఒక్కొక్క 'పదం' తొమ్మిది అక్షరాలలో ఆరంభమై 31 అక్షరాలదా విస్తరించడం సరళాదాసు వృత్తాల లక్షణం

సరళాదాసు భాష ' ఆది ఒరియా' నన్నయ భారతంలో నాటి వేంగీదేశపు తెలుగుపదాలు కనపడినట్టే, ప్రాచీన ఒరియా పదాలు సరళాభారతంలోనూ కనపడతాయి. ఆయా పదాలు ఆధునిక యుగారంభం వరకూ ఒరియాసాహిత్యంలో కనపడతాయి నేటికీ గ్రామీణప్రాంతాల భాషను పరికిస్తే ఈ పదాలు కనపడతాయి.

నీలకంఠదాసు ఇలా అంటాడు

''ఈయన మన సరళాదాసు. ఆయన దేవతట ('దేవత' అనే మాట ఉభయ లింగార్థకంగా తెలుగులో కూడా ఒకప్పుడుండేది) కాడు. సామాన్యమైన మనిషి ఆయన శూద్ర మునిమాత్రమేకాదు. ఒరిస్సాలో దార్శనికుడైన మహావ్యక్తి. ఆది ఒరియా సాంప్రదాయ, భాషా, సాహిత్యరీతులకు మూలపురుషుడు ఆయన మనకు చూపించనిదంటూ లేదు''

స్వేచ్ఛానుసరణమైనందున కవిత్రయ భారతానికీ దీనికిచాలా బేధాలు కనపడతాయి. ప్రసిద్ధమైన రామాయణ భారతకథల్ని రాను రాను ఆయా భాషా సాహిత్యాలు, ఏలా వైయక్తికం చేసుకున్నదీ

ఇలాంటి సాక్ష్యాలద్వారా మనకు తెలుస్తుంది తమదైన రీతిలో అందరూ పురాణేతిహాసాలను పునర్నిర్మించుకున్నారు

కుంతీ పుత్రజననంలోనే కాకుండా, కౌరవుల పుట్టుకలో కూడా దూర్వాసుని పాత్ర సరళాభారతంలో గోచరిస్తుంది. పాండవ జననసమయంలో దూర్వాసుడు స్వయంగా కుంతితో సంగమించినట్టు సరళా భారతంలో వర్ణితమైంది ఇది మరింత నిజానికి దగ్గరగా లేదూ! అలాగే కౌరవులనుగాంధారీగర్భ విచ్ఛేదనపు మాంసఖండ జన్యులుగా కాక దూర్వాసానుగ్రహ జన్ములుగా సరళా భారతం చెపుతుంది

చివరకు నూరుగురి కౌరవుల పేర్లలోకూడా సరళా, కవిత్రయ భారతాలలో ఏకత్వం కనబడదు సరళా భారతంలో కౌరవులందరిపేర్లూ 'దు' 'దుః' 'దూ' అనే అక్షరాలతో మొదలై మూడునాలుగుక్షరాల పేర్లుగా కనపడుతాయి నన్నయ భారతంలో కౌరవుల పేర్లు వ్యాసమూలకాన్ని అనుసరిస్తూ అన్ని రకాల పేర్లూ ఉన్నాయి

కులం అనేది హైందవంలో లేదనీ తరువాత వ్యాపించిన విపరీతం అనీ ఆత్మవంచన చేసుకోవడం, నేటి హిందూమేధావుల లక్షణాల్లో ఒకటి. లిఖిత చరిత్ర కాలంలో వ్యాససదృశుడైన సరళాదాసు తన భారతాన్ని వైదిక సాంప్రదాయాన్ని నిరసిస్తూ కూడా, బహుశా శిష్టజనాదరణకోసం తనను తాను 'శూద్రముని'గా చెప్పుకోవడం గమనార్హం ఈ వినయం వెనకాల వాళ్లగుర్తింపుకోసం ఆరాటం కూడా ఉండేమో. ఏది ఏమైనా ఒక దళిత కవిరాసిన భారత గ్రంధం సర్వజన ప్రామాణికంగా సుస్థిరత పొందడం బహుశా ఒక ఒరియా భాషలోనే జరిగిందేమో!

## అనుబంధం : సరళాభారతంలో కౌరవుల పేర్లు

దుర్యోధన, దుశ్శాసన, దుర్జయ, దుర్వాదల, దుర్జన, దుర్వేద్య, దుర్భేద్య, దుర్దమ, దురంత, దుస్సహ, దురమ, దుఃసమ, దురమ, దుష్క్రమ, దుర్భర, దురాచార, దుష్కర్ణ, దుర్మన, దురదృష్ట, దుస్తనక, దుర్భాగ్య, దుర్బల, దుర్భాంత, దురంతన, దుర్ఘట, దుర్భట, దుర్మన, దుర్ధర్ష, దూషణ దురక్ష, దుర్ధర్ష, దుర్ధర్ష ( ఇద్దరు), దుర్భిక్ష, దురూహ, దుష్పీడక, దుష్పూర, దుర్ధర, దుఃఖద, దుర్మేధ్య, దుష్క్రియ, దురాసద, దుష్టద, దుర్వ్రత, దురాధర, దుశ్వర, దుష్టాని, దుష్కంప, దుస్తవ, దుఃశంక, దుర్మద, దురక్షక, దురాసంగ, దుఃశాల, దుకుహ, దుఃసహ, దుస్తేక, దుఃసంగ, దుర్వహ, దుర్వాసన, దురామా, దుర్విహ, దుష్కర, దుస్సాధ్య, దుర్గుణ, దుర్బీజ, దురాధక్ష, దుష్టాధర్మ, దుఃస్వభావ, దుష్కర్మ, దుర్దిష్ట, దుస్పర్శ, దుర్భూజ, దుర్మోహ, దురాంతక, దుష్ప్రప, దురాప, దుస్పార, దుఃశయ, దురాక్షేప, దుష్ప్రపంచ దుర్లభ, దుస్త్రప, దురద, దుష్పుర, దుష్టదమన, దుర్జన, దుర్దప, దుస్తప, దుగ్రోధర, దుద్వార, దురత్యయ, దురామయ, దుఃసాధ్య, దుర్మాన.

-ఈ నూర్గురూ దూర్వాసానుగ్రహజన్ములే.


Sources for this Article

1. ఒడియా సాహిత్యరేక్రమ వికాస, 2. సరళాభారతం, ఆదిపర్వం

# గ్రాహమ్ గ్రీన్ -మోదతాత్త్విక దృష్టి

- డా॥ వి.వి.బి. రామారావు

బ్రిటన్ ముఖ్య ఎగుమతులుగా గ్రాహమ్‌గ్రీన్ నవలలని సాహిత్యాభిమానాలు, విమర్శకులూ భావించారు ఆయన పొందిన ప్రాచుర్యానికీ, చూరగొన్న జనాదరణకీ దీనిని నిదర్శనంగా తీసుకోవచ్చు

ప్రొటెస్టెంట్ మతస్థుడిగా పుట్టిన గ్రీన్ తన ఇరువది రెండవ ఏట 1926లో కేథలిక్ మతాన్ని పుచ్చుకున్నాడు. కొందరు విమర్శకులు ఆయనను కేథలిక్ రచయితగా పరగణించినా, ఆయన మాత్రం తాను రచయిత ఐనకేథలిక్‌గా చెప్పుకున్నాడు. గ్రీన్ రచనా వైశిష్ట్యానికీ, ఆలోచనా సరళికీ, తాత్త్విక దృష్టికీ సరైనన్యాయం చేకూర్చాలంటే అతన్ని మానవతా వాదియైన భావుకునిగా, ద్రష్టగా పరిగణించడం సమంజసం, సముచితం గ్రీన్ మతదృష్టి సంకుచితమయిన సిద్ధాంతపరమైన మత దృష్టికాదు సంకుచిత, జటిల సిద్ధాంతాతీతమైన, విశ్వాత్మకమైన విలువలను ఇనుమడింపచేసే అవగాహనా పటిమే గ్రీన్ మతం అని చెప్పవచ్చు. మానవతా వాదిగా ఈ మతంలోనే సంపూర్ణమైన విశ్వాసాన్నీ గాఢమైన సానుభూతితో కూడిన అవగాహనా నైశిత్యాన్నీ గ్రీన్ నవలలో మనం చూడగలుగుతాం

గ్రీన్ సాధించిన ఘనవిజయం అతని నవలలో స్ఫుటంగా ద్యోతకమయ్యే కామిక్ విజన్ (Comic Vision) మోదతాత్త్విక దృష్టి సాహిత్యంలో కామెడీ, ట్రాజెడీ అనే రెండు విభాగాలు ముఖ్య సాహిత్య ప్రకియలేకాని ఆరెండు మాటలకూ రెండు భావాలుగా వివరణ అవసరం. కృతుల అంతం (Endıng) మాత్రమే దృష్టిలో ఉంచుకుని కాకుండా, వాటి రసోత్పత్తి భేదాల వల్లనూ వానిలో ప్రతిబింబించే మౌలిక తాత్త్విక దృష్టినీ ఆధారం చేసుకుని ఈ మాటల ఆంతర్యంలోని భావాలను సమగ్రంగా అర్థం చేసుకోవాల్సి ఉంటుంది అంతం (Ending) రసోత్పత్తి (Endive nespouse) మూలతాత్త్వికదృష్టి (Vision) వీటిని మనసులో ఉంచుకుని ఈ రెండింటి స్వభావాలనూ అర్థం చేసుకోవాలి. సంస్కృత ఆంధ్ర రచనలలో విషాదాంత ప్రక్రియ కంటె సుఖాంత ప్రక్రియకే ప్రాధాన్యత లభించింది. దీనికి కారణం సాహిత్యం మతంలోని మౌలికమైన విశ్వాసాలను ప్రతిబింబించడమే హైందవమతంలోని తాత్త్విక దృష్టి జీవితం ఎడల అవగాహనను మౌలికమైన మోద దృష్టిగా రూపొందిస్తుంది. రోమన్ కేథాలిసిజమ్ క్రైస్తవ మతశాఖలలో అతిప్రాచీనమైనది. హైందవమతానికీ ఖేదాంత దృష్టికీ ఎలా పొంతనకుదరదో అదే విధంగా కేథాలిసిజమ్‌కీ ఖేదాంత దృష్టికీ పొత్తుకుదరదు. ఖేదాంత తత్త్వం క్రైస్తవ మతతత్వానికి విరుద్ధమైనదని, ఆ మతంలో ఉన్నవారికి ఏదీ ఖేదాంతం కాదనీ, ట్రాజెడీ చనిపోయిందనీ విమర్శ గ్రంధాలలో పేర్కొనడం జరిగింది ఖేదాంత కృతులలో మౌలికమైనది సంఘర్షణ (Conflict)

---

★ **డా. వి.వి.బి. రామారావు** విజయనగరం మహారాజావారి కళాశాలలో ఆంగ్లశాఖలో ఆచార్యులుగా పనిచేసి, రిటైరై, ప్రస్తుతం ఢిల్లీలో ఉంటున్నారు.

అది మనిషిలోని మంచి చెడుల మధ్య కావచ్చు పరిస్థితులలోనిది కావచ్చు లేదా కేథలిక్ సంప్రదాయంలో ఆదిభౌతికమైనదీ, మానవపూర్వమైనదీకావచ్చు ఖేదాంత కృతిలో నాయకుడు (Tragic Hero) చివరకు జిజ్ఞాసువవుతాడు వెలుగునుచూస్తాడు నాశనమయిన తరువాత ఆ వెలుగు అతనికి మానసికమైన శాంతిని చేకూర్చడానికి మాత్రం పనికి వస్తుంది ఖేదప్రవృత్తితో కూడినరచనలకు మూలం మనిషిలోని బలహీనత. పోరాటం చివర అతని ఓటమే అతనిగెలుపు అదే ఖేదాంతం, తాత్త్వికంగా ఆలోచిస్తే ఆధునిక రచనలలో ఖేదాంతం లేనేలేదని వాదించేవారూ ఉన్నారు ప్రాచీన ఖేదాంత కృతులకూ, ఆధునిక ఖేదాంత కృతులకూ, అవి కలిగించే స్పందనలో మౌలికమైన భేదం ఉంది. ఆధునిక కృతులలో కేవలం నైరాశ్యత కనపడుతుందని కొందరు విమర్శకులు స్పష్టంచేశారు మోదతాత్త్వికదృష్టి ఖేదాంత దృష్టికంటెపటిష్టమైనది, సమగ్రమైనది, లోతైనది, విస్తృతమైనది కాబట్టి విలువైనది జీవిత స్థితిని విశదీకరించడానికి ఖేదాన్ని, మోదాన్నీ (వ్యాధులనేకాకసుఖసంతోషాలను కూడా) అవగాహనచేసుకుని జీవితాన్ని రెండింటికలగలుపుగా చూపించిన రచనలే జీవితానికీ, జీవ భావానికీ (Sense of life) దగ్గరగా ఉంటాయి హోరెస్ వాల్‌పోల్ ఒకచోట ఇలా అన్నాడు ''ప్రపంచం ఆలోచించే వారికి మోదాంతం, అనుభవించేవారికి ఖేదాంతం.''

ఖేద ప్రవృత్తినుండి మోద ప్రవృత్తికి పరిణితి చెందడం మహాకవులలో కనపడుతుంది. డాంటే, చాసర్, షేక్స్‌పియర్‌లలో ఈ పరిణితీ పరిణామమే విమర్శకులు గమనించారు డివైన్ కామెడీలో డాంటేని ఇన్‌ఫెర్నో నుంచి పర్గెటోరియో మీదుగా పారడైనోలోకి తీసుకుని వెళ్లినది ఈ పరిణామమే ఛాసర్‌ను ట్రాయిలస్ లోనుంచి కౌంటరేబరీ టేల్స్‌లోనికీ, షేక్స్‌పియర్‌ను టైటస్ ఆండ్రోనికస్ నుంచి టెమ్‌పెస్ట్‌కు తీసుకువెళ్లిదీ ఈ పరిణామమే

మోదాంత కృతులలో జీవితం ఎడల సమంజసమైన అవగాహన ఉంటుంది సమంజసమైన దృక్కోణం నుంచి అసందర్భాలను, అసంగతమైన, అర్థంలేని, అర్థంకాని, ఉన్మాదాన్ని కలిగించే తర్కాతీతమైన అనుభవాలనూ సంఘటనలనూ గుర్తించడానికి అవసరమయినచైతన్యాన్ని మనకు ఇచ్చేది మోదాంత తాత్త్వికదృష్టే. ఈ దృష్టి స్వరూప స్వభావాలను నిర్వచించడం కష్టమయినా, వైయక్తికంగా అనుభూతి చెందడం సాధ్యమే ఈ దృష్టి క్షమనీ, సహనాన్నీ, అవగాహననీ, సానుభూతినీ పెంపొందింపచేస్తుంది మానవనైజం తద్వారా సులభ గ్రాహ్యమై మనలో ప్రేమనీ, సదవగాహననీ ఇనుమడింపచేస్తుంది ట్రాజెడీ కామెడి కంటె లోతయినదన్న నమ్మకం ఒకప్పుడు ఉన్నా, కళాత్మకమైన రచనలన్నీ మోదాంతంలేనని చెప్పాడు జోసేఫ్ వుడ్ క్రచ్ (Jozeph wood crutch) రచయిత సృజనాత్మక దృష్టిలో ఖేదమోదాలు రెండూ భాగాలే అవి ఒకదానిలో ఒకటి నిబిడీకృతమైనప్పుడు అవగాహనకే వన్నెతెస్తాయి వాటి మేళవింపు సంఘ పరమైన, జన్మపరమైన (కేథలిక్ దృష్టిలో) మానవుని పాటు ( ఇన్‌వాల్వ్‌మెంట్) లోని వ్యంగ్యాత్మకత యొక్క చైతన్యాన్ని, అవగాహననీ మోదాంతమైన దృష్టిగా చెప్పవచ్చని సూసన్ లేంగర్ అనే ప్రసిద్ధ మానవశాస్త్రజ్ఞురాలు చెప్పింది ఇంకా సూక్ష్మంగా చెప్పాలంటే - తెలివితక్కువతనాన్ని తెలివితక్కువ తనంతోనే క్షాళన చేయడంమే మోదతాత్త్విక దృష్టి

సృజనాత్మక రచయితలందరి గమ్యం ఒకటే భావ ప్రకటన ద్వారా సంఘటితం చెయ్యబడిన ఒక జీవ భావన (Sense of life) ని అందించడమే నవల ఉనికికి ఆటపట్టు అది జీవితానికి పాతినిధ్యాన్ని వహించగలగడమే జీవితానుభూతి (`Delt life' - Susan Lourger వాడిన పదబంధం) నవల విలువకు ఆధారం జీవితంలోనూ, నవలలోనూ ట్రాజిక్‌రిధిమ్, కామిక్‌రిధిమ్ ఉంటాయానీ, వీటి అంతర్వాహకత్వం, సమ్మేళనంలోనే జీవితావగాహన ఉంటుందని లేగర్ అభిప్రాయపడింది ఈ రెండు పొంతనకుదరని పరస్పరం వికటించుకునేవి కావు.

The fact is that the two great rhythmics, cosmic and tragic are redically distinct does not mean that they are each other's opposites or even in compatible forms. Tragedy can rest squarely on a cosmic substructure and yet be pure tragedy This is natural enough for life, from which all rhythmics spring, contains both in every mortal organism

మానవజీవితం, ఉనికి (Enistence) మోదాంతమన్న విషయం గ్రీన్ సృజనాత్మకతలోని మౌలికఅంశం స్టేంబౌల్ ట్రెయిన్ (Stambul Train (1932)) నవల ఉపక్రమణిక( ఎపి గ్రాఫ్ Epigraph) గా జార్జి శాంతాయనా మాటలను వాడుకున్నాడు ప్రకృతిలో ప్రతి అంశమూ దాని ఆశయసారంలో, శ్రావ్యమూ, గమ్యంలో విషాదాంతమూ, ఉనికిలో మోదాంతమూ (Every thing in nature is lyrical in its ideal essence, tragic in its fare and cosmic in its existence)

మరొక నవలలో ఒక పాత్ర ఇలా అంటాడు. ''మోదాంతానికి పూచీ ఇచ్చే ప్రపంచంలో మనం ఉంటేదానిని తెలుసుకోవడానికి అంతకాలంపడుతుందా? మహాపురుషులకు అదితెలిసేకాబోలు చిద్విలాసంగా ఉండగలుగుతారు వాళ్ల కథ అంతాన్ని చూడగలుగుతారు కాబట్టి మనుషుల వ్యధలను తీవ్రంగా పట్టించుకోరేమో!''

తన సృజనాత్మక జీవితంలో ఒక దశలో గ్రీన్ మానవుల వ్యధలను పట్టించుకున్నా, పరిమితిచెందిన దశలో ఆధి వ్యాధులని అవగాహన చేసుకునే పరిపక్వతను సంతరించుకుని మోదతాత్త్విక దృష్టిని అలవరచుకున్నాడు. ఈ దృష్టి జీవితంలోని అసంబద్ధతలనూ, అసందర్భాలనీ, హాస్యాస్పదాలనీ గుర్తిస్తుంది ప్రపంచంలో గులాబీ ఎంతభాగమో దానిని తినేసే క్రిందనున్న పురుగు అంత భాగమని పురుగును ద్వేషించే రచయిత ఖేదాంతాన్ని రాస్తే, దానిసహజతను గుర్తించిన రచయిత మోదాంతాన్ని రాస్తాడని కవి కీట్స్ ఓ దగ్గర చెప్పాడు

'మినిస్ట్రీ ఆఫ్ ఫియర్' అనే నవలలో ఒక పాత్రను గురించి రచయిత ఇలా అనుకుంటాడు. ''న్యాయం, శిక్ష వంటి భావాలు శిల్పాలలా అతని మనసులో శాశ్వతంగా నిలిచి ఉన్నాయి వాటి సారం చివరకు రెమిట్ ( ఒకపాత్ర పేరు)గా, వేలాది రెమిట్స్‌గా మిగులుతుంది కాని నువ్ భగవంతుడిలో, సైతానులోనూ నమ్మితే అది అంత నవ్వు పుట్టించే విషయంకాదు. ఎందువలన

నంటేదేవుడూ, సైతానూ కూడా హాస్యాస్పదమైన మనుషుల్ని, చేతకాని మనుషుల్ని, సామాన్యమైన సంకుచితులైన మనుషుల్ని వారివారి స్వప్రయోజనాలకి ఉపయోగించుకున్నారు దేవుడు ఉపయోగించుకున్నప్పుడు నువ్వు పేలవంగా ఔదార్యం గురించి మాట్లాడావు సైతాను ఉపయోగించుకున్నప్పుడు దౌష్ట్యాన్ని గురించి మాట్లాడావు కాని మూల పదార్థం రెంటిలో ఎప్పుడూ మందమైన, అసహ్యమైన మానవ అల్పత్వమే!''

గ్రీన్ రచనా వ్యాసంగాన్ని ఒక రోగచికిత్సా విధానంగా (Therapy) గావించాడు ''రచనలు చేయని, సంగీతం కూర్చని, లేదా చిత్ర లేఖనం చెయ్యని వారందరూ మానవస్థితిలో ఉన్న ఉన్మాదాన్నీ, విచారాన్నీ, ఘోరచయాన్నీ ఎలా తప్పించుకోగలరా అని నేను ఒక్కొక్కప్పుడు ఆశ్చర్యపడుతూ ఉంటాను ''అని గ్రీన్ ఒకచోటరాశాడు స్వీయరూపకల్పన సంతరించుకున్న ఈ చికిత్సా విధానం అతనిలోని మాంద్యాన్నీ, ఖేదాంత దృష్టినీ తొలగించింది జీవితం ఎడల అతని అవగాహనలో ఒక ఆరోగ్యమయిన, ఆహ్లాదకరమైన మార్పుని తెచ్చింది.

1974 లో ఎబర్నెట్ అవుట్‌కేస్ (కలెక్టెడ్ ఎడిషన్)కి రాసిన ఉపోద్ఘాతంలో గ్రీన్ ఇలా అన్నాడు నేవెళుతున్న మార్గం 'ఎ విజన్ టు మోరిన్' లోను '' ఎబర్నెట్ అవుట్‌కేస్'' లోనూ నాకు తెలియకుండానే లాయంచా (డాన్ క్విక్‌సోట్) ఖేదమోద ప్రదేశానికీ వెళ్లాను అక్కడే ఉంటానని అనుకుంటున్నాను నా మార్క్సిస్ట్ విమర్శకులూ నా విశ్వాసం అవిశ్వాసంలో ప్రమేయం పెట్టుకుంటూ నే వ్రాసిన అతి చీకటి పుస్తకంలో కూడా నేను మోదాంతాన్ని చూసినట్టు గమనించనేలేదు

ఈ విధంగా మోదాంత స్థితివైపు తన మొగ్గుబాటును గ్రీన్ బహిరంగంగా వెలిబుచ్చాడు

'కాథలిక్ వరల్డ్' అనే పత్రికలో విలియమ్ జె రెవాన్ 1957 డిసెంబరులో ''గ్రీన్ దృష్టిలో పరిణితి'' అనే వ్యాసంలో దీనిని గమనించాడు. నిజమైన పరిణితి ఖేదాంతరిలోని అవగాహనలో ఆగదు. అ పరిణితి ఖేదాంతం మోదాంతంచే వెలుగునింపబడి ఒక ఆనంద దృష్టిని ఇవ్వడంలో సంబంధించినది.'' ఎబర్నెట్ అవుట్ కేసును సమీక్షిస్తూ కెన్యాన్ రివ్యూ (వేసవి 1961)లో స్ట్రాట్‌ఫర్డ్ గ్రీన్ దృష్టిలోని పరిణితిని గ్రహించాడు ''1950 తరువాత గ్రీన్ నవలలోనూ, వినోదాలలోనూ (గ్రీన్‌రెండు తరగతుల కల్పన రాశాడు - నోవెల్స్ - ఎంటర్ టెయిన్‌మెంట్స్) ఒక కొత్త మోదాంత దృష్టి అంతకు పూర్వం ఉన్న వేదాంత దృష్టిని తోసిపుచ్చి దాన్ని ఆక్రమించుకుంది. ఇదే దృష్టి ఈ ఆలోచనా పూర్వకమైన (Serious) నవలలో అంతర్వాహినిగా ఉంది ''

ది కావెండీయన్స్ (1966) నవలకు ఉపక్రమణికగా హార్డీ వాక్యాన్ని గ్రీన్ ఉపయోగించుకున్నాడు ''దృక్కోణాలు మనలోనే ఉన్నాయి ఎవరు రాజుగా కపడితే అతడేరాజు.'' ఈ నవలలో ఒక పాత్ర - బ్రౌన్ - ఒకచోట ఇలా అన్నాడు.'' జీవితం ఒక మోదాంతం. నేను సంసిద్ధుడనై ఎదురుచూసిన ఖేదాంతం కాదు మనమంతా ఒకహాస్యగానిచే

మోదాంతం వంక తరమబడుతున్నామని నాకు అనిపిస్తోంది.'' ఈమాటలనే ఉదహరిస్తూ డేవిడ్‌లాడ్జ్ గ్రీన్‌గురించి ఇలా అన్నాడు '' ఈ మాటలని వ్యక్తిగతమైన ఒప్పుకోలు (Confession) గా కాకుండా, అందులో దైవికమానవ విలువల ఘర్షణతో కూడిన ఖేదాంతం నుంచి, అస్తవ్యస్తమైన, మానవ ప్రవర్తనయొక్క గజిబిజితో కూడినవ్యంగాత్మకమూ, మోదాంతమూ అయినమోదతాత్త్విక దృష్టిలోకి పురోభివృద్ధిచెందినట్టు చెప్పే ఒకటీ కదా మనం గ్రహించవచ్చు.''

ఈ విధమయిన దృష్టి పరిణామమే హార్డీ పలుకులను గ్రీన్ మరొక్క దగ్గర వాడుకోవడంలోనూ మనం గమనించవచ్చు. ది ఆనరకౌరీన్సల్ (1976) నవలకు హార్డీమాటలే ఉపక్రమణిక. 'అన్ని విషయాలూ ఒకదానిలో మరొకటి కలిసిపోతాయి మంచి - చెడులోకీ, దాతృత్వం - న్యాయంలోకీ, మతం - రాజకీయంలోకీ '' ఈనవలలోని ఒక పాత్ర ఇలా అంటాడు! ''సామాన్య విశ్వాసానికి విరుద్ధంగా నిజం ఎప్పుడూ నవ్వు పుట్టించేదిగా ఉంటుంది. ఖేదాంతాన్ని భావించుకోడానికీ కనిపెట్టడానికే ప్రజలు ప్రయాసపడతారు. ఒక చలన చిత్రాన్ని సమీక్షిస్తూ గ్రీన్ 1936లోనే ఇలారాశాడు. '' నిజం ఎప్పుడూ ఖేదాంతం కాదు. ఎందుచేతనంటే మనుషులు అంత ఉదాత్తమయిన రీతిలో తయారు చేయబడలేదు నిజం విచారకరం కావచ్చుకాని, నిజం నవ్వు పుట్టించేదికూడా!''

జీవితం ఎడల గ్రీన్ అవగాహనలోనూ, దృష్టిలోనూ గమనార్హమైన పురోభివృద్ధీ పరిణితీ ఉన్నాయి. గ్రీన్ రచనా జీవితంలో ముఖ్యంగా మూడు దశలు కనపడుతాయి. మొదటిదశలో ఖేదదృష్టిలో ఒక అంతర్వాహినిగానే మోదతాత్త్విక దృష్టి కనపడుతుంది 1938 లో ప్రచురించబడిన బ్రైటన్‌రాక్ 'వినోదం'గా రాయబడినా అందులోని మంచిచెడుల ధృవత్వాల బిగువు వలన అవి ఒక విషాదాంత నవలగా రూపొందడం రచయితనే చకితుణ్ణి చేసింది. కాని అది ట్రాజెడీ కాదు. ట్రాజిడీ వల్ల జరిగే క్షాళన (Cathorsis) ఈ నవల చదివిన తరువాత జరుగదు దీనికి కారణం ఈ రచనలో గ్రీన్ మోదతాత్త్విక దృష్టి పెల్లుబకడమే. విర్ర వీగి ఆకాశంలోకి ఎగరాలనుకున్న మనిషి క్రిందిపడి నడుం విరగకొట్టుకోడం ఆ వ్యక్తికి దుఃఖాంతమే అయినా, చూసే వాళ్లకది విషాదాంతంగా ఆమోదయోగ్యం కాదు అంతేకాదు. పింకే (అందలి ప్రధానపాత్ర) కుర్రవాడు. అతని స్వభావంలోని చెడు తెలిసే చేస్తున్నపాపం - అతనిలోని కేథలిక్ ధర్మాల దృష్ట్యా (అతను బాల్యంలో మతగురువు నవుతానని ప్రమాణం కూడా చేస్తాడు) కేవలం ఒక అత్యుక్తి ఇది మోదదృష్టిని స్ఫురింపచేసే సాధనాలలో ఒకటి. అతని పీలరొమ్ము (Pigear Chest ) ఇందుకే ఉపయోగిస్తుంది మానవ స్వభావ వైచిత్రితో నవ్వు పుట్టించి తద్వారా మనలోని అవగాహనను పెంచే అనేకకీలక సూత్రాలలో ఈ వైకల్య వికార వర్ణనలు ముఖ్య పాత్రనువహిస్తాయి.

రెండవదశ నవలల్లో ముఖ్యమైనది 'ది పవర్ అండ్ ది గ్లోరీ (1940)' ఇందులో తన వ్రతాన్ని ఉల్లఘించి మద్యపానానికి బానిసై ఒకస్త్రీతో సంబంధం పెట్టుకుని తండ్రియైన 'మతగురువు' మానవతావాది. అతన్ని పట్టి చంపించాలనే పోలీసు ఉద్యోగి మార్క్సిస్ట్. మార్క్సిస్ట్ భౌతికవాదానికీ లోపభూయిష్టుడయినమతగురువు ఆధ్యాత్మికవాదానికీ మధ్య సంఘర్షణ ఇందులోని ముఖ్యాంశం - పవర్ (బలిమి) అధికారిదే అయినా గ్లోరీ (వైభవం) భగవంతునిది ఈ నవల భౌగోళిక

రాజకీయ నేపథ్యం - వీరిద్దరి మధ్యా జరిగిన సంభాషణా, జైలుగదిలో చీకటిలో ఒక జంట మైధునకలాపమూ, మత గురువు అనేక సార్లు తప్పించుకోడమూ, చివరకు ద్రోహం అతన్ని అంతమొందించడం, అతను చంపబడినా మరొక మతగురువు చివరన ప్రవేశించడమూ ఇందులో హృద్యంగమైన సంఘటనలు ఇందులో మోదతాత్త్విక దృష్టిలో హృద్యంగయమైన మతగురువు చివరన ప్రవేశించమూ ఇందులో హృద్యగయమైన సంఘటనలు. ఇందులో మోదతాత్త్విక దృష్టి పుష్కలంగా ఉంది దీనిలో ప్రారంభమయి చిక్కనవుతూ 1960 లో ప్రచురించబడిన 'ఎబర్నట్ అవుట్‌కేస్' లో స్ఫటికీకరణ (Crysatlızatıon) చెందింది ప్రతిరచయితలోనూ ఈ ప్రక్రియ జరిగి అతని దృష్టిలోని అతిముఖ్యమయిన విషయం స్పష్టంగా చెప్పబడి, అతని అంతరంగక విశ్వం చదువరులందరికీ సుస్పష్టం అయ్యే క్షణం వస్తుందని గ్రీన్ తను హెన్రీ జేమ్స్ మీదవ్రాసిన వ్యాసంలో చెప్పాడు ఈ స్ఫటికీకరణం 'ఎబర్నట్ అవుట్‌కేస్' లోని క్వెరీ చనిపోతూ నవ్విన నవ్వు లాంటిదానిలోనూ చివరి మాటలలోనూ ఉంది '' ఇదంతా అసందర్భమో, అసంబద్ధమో లేక ''

గ్రీన్ మోదతాత్త్విక దృష్టి అతని రచనా జీవితము మూడవదశలో పూర్తిగా విప్పారి వెలుగు విరజిమ్మేటట్టు వెల్లివిరిసింది నవ్వు గాయాన్నీ, వ్యధనీ - కష్టాన్నీ మాన్పగలదు హాస్యం చిప్పిల్ల జేసే జలయంత్రం కామెడీ నవ్వగలిగే శక్తి మోదప్రవృత్తి ఇది జీవితంలోని అసంగతలపై మనచైతన్యాన్ని నిశితం చేస్తుంది. ట్రాజెడీ సంఘర్షణ ముడిపడి ఉంటే, కామెడీ సర్దుబాటునీ, పరిస్థితులకు అలవాటుపడే ధోరణినీ అలవరచుకునేటట్టు చేస్తుంది ఆల్డస్ హక్స్‌లీ వ్రాసినట్టు ట్రాజెడీ పాక్షికమయిన సత్యాన్ని చెప్తే, ఎపిక్ సమగ్రమైన సత్యాన్ని నింపుకుంటుంది హక్స్‌లీ ఎపిక్ గురించి చెప్పినవిషయం కామెడీకి అన్వయింప చెయ్యవచ్చు

ది కామేడియన్స్ (1966), ది ఆనరరీ కౌన్సల్ (1973) ట్రావెల్స్ విత్‌మై ఆంట్ (1969), దిహ్యూమన్ ఫ్యాక్టర్ (1978) గ్రీన్ మోదతాత్త్విక దృష్టిని బాహాటంగా చాటి చెబుతున్నాయి.

ఖేదాంతం కంటె మోదాంతం తాత్త్వికదృష్టి పరిణితి చెందినదని నవీనవిమర్శకులు గుర్తించారు వైలీ సైఫర్ (Wylie Sypher) ఇలా రాశాడు. 'ట్రాజెడీ, కామెడీ ఏవో బాంధవ్యాన్ని కలిగి ఉన్నాయని - కామెడీ ట్రాజెడీ చెప్పలేని మనస్థితిని గురించి మనకు చెప్పగలదన్న విషయమూ బహుశః ఆధునిక విమర్శ కనుగొన్న అతిముఖ్య అంశం ''

గ్రీన్ రచనలలో నుంచి ఓ వ్యవస్థను (System) ను గ్రహించవచ్చు గ్రీన్ రచనలలోని సంఘటితమైన, సృజనాత్మకమయిన విశ్వంలో నుంచి ఈ వ్యవస్థను, మోదతాత్త్వక దృష్టిని గమనించవచ్చు దృష్టి పరిణితి వలన అతని కథావస్తువులు పరిణామం చెందిన విషయం సావధానంగా అతని రచనలు చదివిన వారికి తేట తెల్లమవుతుంది పూర్వదశలలోని ద్రోహం, మురికి, ఆనందం లేని పశువాంఛ క్రమంగా అవగాహనగా, స్నేహంగా, ప్రేమగా మలచబడతాయి ద్రోహాలనుంచి స్నేహంలోకి చీకటిలోనుంచి వెలుగులోకి గ్రీన్‌పాత్రలు ( ఎన్నిలో పాలతోనయినా) పరిణితి చెందుతాయి ఈ మోదాంత తాత్త్విక దృష్టి ఉదాత్తమయిన భావుకులలో గ్రీన్ స్థానాన్ని ౹శ్చయం చేస్తుంది ద్రష్టగా అతన్ని చిరస్మరణీయుణ్ణి చేస్తుంది.



**సీమన్ హీని** 1995 నోబెల్ సాహిత్య పురస్కార గ్రహీత

MISIMI/[illegible] RNI Regd No 45042/90 Telugu Monthly, Hyderabad-500 020 Postal Regd No H/SD/1




హిమశైల (ప్రముఖ చిత్రకారులు డా. సంజీవ దేవ్)